# గాంధి హృదయము



*

ముదిగంటి జగ్గన్న శాస్త్రి, బి. ఏ.

*

పల్లెటూర గ్రంథమండలి - తణుకు
ప॥ గో॥ జిల్లా

# విషయసూచిక




| | పేజీ |
|---|---|
| తొలిపలుకు | |
| మహాత్ముని విశ్వాసము | 1 |
| అసలు మతము | 7 |
| భగవంతుడు అవ్యక్తుడు | 16 |
| మతము - రాజకీయములు | 25 |
| సత్యవ్రతము - (ఆశ్రమ నియమములు) | 26 |
| అహింస | 26 |
| బ్రహ్మచర్యము | 27 |
| జిహ్వను కట్టిపెట్టుట | 28 |
| అస్తేయము | 29 |
| అభయము | 31 |
| అస్పృశ్యత | 31 |
| దేశభాషల ద్వారా విద్య | 32 |
| ఖద్దరు వ్రతము | 33 |
| రాజకీయములు - మతము | 33 |

| | |
|---|---|
| భారత సంస్థలు | 34 |
| వర్ణాశ్రమము | 40 |
| హిందూ - ముస్లిం ఐక్యత | 42 |
| ఖద్దరు | 46 |
| మతము - అస్పృశ్యత | 56 |
| వైకం సత్యాగ్రహము - విజయభేరీ | 59 |
| కరువులు - రాటము | 61 |
| అస్పృశ్యత - ప్రపంచ సమస్య | 64 |
| అస్పృశ్యులేమి చేయవలెను ? | 68 |
| గాంధీజీ - కొన్ని యపోహలు | 70 |
| రాజభక్తి రాజద్రోహముగా మారుట | 79 |

# తొలిపలుకు

అప్రాచ్యరాజ్యముల పోరాటములో 1914లో మొదటి ప్రపంచయుద్ధము ప్రారంభమయ్యెను. 1893లో దక్షిణాఫ్రికాలో కాలిడి యచ్చటి శ్వేతప్రభుత్వముతో 21 సంవత్సరములు సాత్త్విక నిరోధముసలిపి 1915లో గాంధీజీ స్వదేశమునకు తిరిగివచ్చెను. అతడొక సంవత్సరము దేశమంతయు తిరిగి భారతదేశ ఆర్థిక, సాంఘిక, రాజకీయ, ఆధ్యాత్మిక దుస్థితినంతను కూలంకషముగ నవగతము చేసికొనెను. 1916లో 'గాంధీ అనిబిసెంటు సంఘటన' యనునొక చరిత్రాత్మక కాశీయుదంతము సంభవించెను. అప్పటికింకను కమ్యూనిజము పుట్టలేదు. 1918లో మొదటియుద్ధము ముగిసెను.

విజయగర్వితులైన బ్రిటిషువారప్పటి వరకు మనసహాయము నర్థించి మనజన, ధనబలసహాయమును విస్మరించి 1919లో రౌలటు చట్టములను ప్రసాదించి లోకమెరుగని పంజాబు హత్యలను మనకు కానుకగాసమర్పించిరి, 1920 మొదలు 1947 అగష్టు 15 వరకు భారతదేశములో స్వరాజ్య యజ్ఞము యిరువదియేడు వత్సరములు జరిగెను.

ఆయజ్ఞము, ఆ చరిత్ర ప్రపంచములోనే యపూర్వము, అనూహ్యము ఇప్పుడు పది పన్నెండు వత్సరముల శాలురీవీర గాథ, దేవతల నశ్రుపూరిత నేత్రులనుగావించిన హృదయ విదారకఘట్టములు వినినపుడిది యొకకట్టుకథ క్రిందమాత్రమే వారికితోచగలదు. నేటిప్రపంచము కూడ దీనిని నమ్మజాలని స్థితిలో నున్నదనుటలో నాశ్చర్యములేదు. నేడెక్కడ చూచినను, ఎక్కడవిన్నను అణుబాంబు రొదతోను న్యూక్లియరు విజ్ఞాన వరప్రసాద జనితమానవ హోమకాండతోను నిండియున్న యీనాగరిక ప్రపంచమునకిది యొకపుక్కిడి పురాణముగ ద్యోతకమగుట వింతకాదు. కానియిది యీభారత భూభాగముమీద జరిగిన వీరనాటకము.

ఈ నాటక సూత్రధారి గాంధీజీ. అతనిని గురించినగాథయే మనము 'గాంధీగారడీ' యను గ్రంథములో వినబోవుచున్నారము. ఇది యతని హృదయపరిపాకమును తెలిసికొనగోరువారికొక దర్పణమువలె నుండగలదని నాయాశ. కనుకనే దీనికి 'గాంధీహృదయము' అను పేరుపెట్టితిని.

# గాంధీహృదయము

## మహాత్ముని విశ్వాసము

మహాత్ముడు తనవిశ్వాసమును గురించి 1909లో యిట్లు నిష్కర్షగా చెప్పియున్నాడు.

1. తూర్పు-పడమర యను నభేద్యమగుగోడ యెచ్చటను లేదు.

2. పాశ్చాత్యనాగరికత లేక ఐరోపానాగరికత యనున దొకటిలేదు. కాని కేవలము విషయప్రధానమైన నవీననాగరికతాస్వరూప మొకటికలదు.

3. ఈ నవీననాగరికత సోకుటకు పూర్వము యూరపు ప్రజలుకూడ తూర్పుదేశ ప్రజలభావములవంటి భావములతోనే యుండెడివారు.

4. ఇప్పుడు భారతమును పాలించుచున్నది బ్రిటిషువారు కాదు. రైళ్లు, టెలిగ్రాములు, టెలిఫోనులుద్వారా నవీననాగరకతయే మనలను పాలించుచున్నది.

5. బొంబాయి, కలకత్తా, మద్రాసులవంటి ముఖ్యనగరములే 'నవీనభారత దేశము' నగల రోగభూములు.

6. నవీనపద్ధతుల నాధారముగా నేర్పరచుకొని రేపు బ్రిటిషుప్రభుత్వమునకు బదులు భారతీయులే పాలించినను

భారతదేశమునకు చేకూరువైభవమేమియు నుండజాలదు, అప్పుడు యింగ్లండుకుపోవు ధనప్రవాహముకొంత మిగుల్చు కొనుట మాత్రమే జరుగవచ్చును.

7. పాశ్చాత్యులు నవీననాగరికతను పూర్తిగా విడనాడిన నాడే తూర్పు పశ్చిమములు రెండు నిజముగా కలియగలవు. లేక తూర్పుదేశములు పూర్తిగానవీన నాగరికతను చేపట్టిన నాడు కూడా వారు కలిసినట్లు కనపడవచ్చును. కానియా కలయిక యాయుధములతో దట్టింపబడిన శాంతి. అది యిప్పటి జర్మనీ, యింగ్లండుల మధ్యనున్న శాంతివంటిది. ఈ రెండు జాతులు నేడు ఒకరినొకరు మ్రింగివేయకుండ 'మృత్యుసదనము' లోనే జీవించుచున్నవి.

8. ఒక వ్యక్తిగాని కొందరు వ్యక్తులు కలిసికొని ప్రపంచమునంతను సంస్కరింప బూనుట, యూహించుట కేవలము మంకుతనము. అతి కృత్రిమము, అతి వేగవంతములు నగు యంత్ర పరికరములతో దానిని సాధింప బూనుట సాధ్యమైన దాని కర్రులు చాచుట వంటిదేయగును.

9. విషయ సౌఖ్యములను పెంచుకొనినంత మాత్రము చేత నైతికాభివృద్ధి చేకూర జాలదని మనము సామాన్యముగా చెప్పవచ్చును.

10. వైద్యశాస్త్రము కరుడు గట్టిన 'గారడీవిద్య' ఘన వైద్య నైపుణ్య మనబడు దానికంటె గోసాయి వైద్య

మనేక రెల్లు మంచిది.

11. ఆసురీ శక్తి తన పనుల కొరకే ఆస్పత్రులను విని యోగించు కొనుచు వానిని తన రాజ్యాధికారమును నిలుపు కొను పరికరములుగా చేసినది. అవి చెడ్డను, దుఃఖమును, అవినీతిని, నిజమైన హానిసత్వమును సాగించుచున్నవి. సుఖ వ్యాధులకు, క్షయకు ఆస్పత్రులే లేనిచో కామ రోగములు, క్షయ రోగములు తక్కువయ్యెడివి.

12. గత యర్ధశతాబ్దిలో భారత దేశము నేర్చుకొనిన పాఠములను మరచి పోవుటలోనే దాని మోక్షము కలదు. రైల్వేలు, టెలిగ్రాఫులు, ఆస్పత్రులు, లాయర్లు, డాక్టర్లు వంటివారు తగ్గిపోవలెను. పై తరగతులనబడు వారు తమ జడజీవితములను వదలి చైతన్యవంతులై అర్థవంతమైన మతప్రవృత్తిగల నిరాడంబర వ్యావసాయిక జీవితమును (అదియే నిజమైన యానందమునిచ్చు జీవితమని గుర్తించి) జీవింప నేర్చుకొనవలెను,

13. భారత దేశము యంత్రములద్వారా తయారగు వస్త్రములను, విదేశీ మిల్లులు కాని స్వదేశీ మిల్లులు కాని, కట్టరాదు.

14. ఈ పని చేయుటకు యింగ్లండు భారత దేశమునకు సాయపడవచ్చును. నావలె భావించువారు యింగ్లండులో నేడు చాలమంది కలరని నే నను కొనుచున్నాను.

15. ప్రజల విషయ సౌఖ్యములకు మితి కల్పించి సంఘమును క్రమబద్ధ మొనరించిన పూర్వ ఋషులలో యదార్థ జ్ఞానముండెడిది. ఐదువేల యేండ్ల క్రిందటి మోట నాగలియే నేడు మన వ్యవసాయకుని పరికరము ఆమోటయిందు లోనే కలదు. ఇట్టి పరిస్థితుల లోనే ప్రజలు చిరంజీవులగుదురు. యూరపు ఆధునిక కార్యకలాపములను ప్రారంభించిన దాది పొందుచున్న శాంతి కంటె నెక్కు వశాంతినే ప్రజ లనుభ వింపగలరు. ప్రతివిజ్ఞాని, ముఖ్యముగా ప్రతి ఆంగ్లేయుడు, అతని కిష్టమున్నచో, నీ సత్యమును గ్రహించి తదను గుణముగ ప్రవర్తింప వచ్చును. యథార్థమైన స్వాత్త్విక నిరోధ తత్త్వముద్వారా నేనీ కచ్చితమైన శారాంశములకు రాగలిగితిని. ప్రస్తుత పిచ్చి గంతులతోనేతృప్తినొందు ప్రజలలో నిట్టి యపూర్వ సంస్కారముక లుగునా యనుశంక, సాత్త్విక నిరోధకుడనైన నాకవసరము లేదు. నేనీ సత్యమును గ్రహించితిని, కనుక ప్రజలందరు ప్రారంభించు వరకు నేను వేచి యుండనక్కరలేదు. ఈ విధముగ భావించు వారందరు ముందు యీ మార్గమును త్రొక్కవలెను. మన మార్గములో ధర్మమున్నచో తక్కిన వారు మనల ననుసరింపక తప్పదు. సిద్ధాంతము చెప్పబడినది; సాధ్యమైనంత వరకు మనము దాని నభ్యసింప వలెను. ఈ రొంపి మధ్య నివసించుచున్న మనమీ కళంకమును పూర్తిగా పోగొట్టు కొనలేక

పోవచ్చును. రైలు ప్రయాణము వచ్చినప్పుడెల్ల నేను తప్పు చేయుచున్నట్లే భావింతును.

దీని వలన కలుగు న్యాయమైన ఫలితమునకు నేను వెరువను. ఎట్టి శీఘ్ర గమాగమన సౌకర్యములు లేనిరోజులలో అన్ని యుపద్రవములను ధిక్కరించి బోధకులు, యాచార్యులు, తమ యారోగ్యము కొరకుగాక, మానవ కళ్యాణము కొరకే పాదచారులై వెడలెడి వారు. అప్పుడు కాశీ ప్రయాగాది పుణ్యక్షేత్రములు పవిత్ర ప్రదేశములు. నేడో! అవి యసహ్యరూపములు.

వర్ణవ్యవస్థను గురించి గాంధీజీ యిట్లు వ్యాఖ్యానించెను. వర్ణమనగా మానవుని వృత్తిని నిర్ణయించుటకై గావింపబడిన పూర్వ నిర్ణయమని యర్థము, తన జీవితమును గడుపుకొనుటకు మానవుడుతన పూర్వుల వృత్తులనే యవలంభింపవలెనని వర్ణముయొక్క న్యాయము. ప్రతిశిశువు సహజముగ తన తండ్రి 'రంగు' వృత్తిని కలిగి దాని ననుసరించును. కనుక నొకవిధముగ వర్ణము పారంపర్య ధర్మము, న్యాయము. వర్ణముహిందువుల మీద రుద్దబడినది కాదు. కాని యదివారి శ్రేయస్సునుకోరిన ధర్మకర్తలచే కనుగొనబడిన న్యాయము. అదిమానవుల కల్పనకాదు, అది ప్రకృతి యొక్క ప్రచండ న్యాయము. న్యూటను కనుగొనిన గురుత్వాకర్షణ శక్తివలె నది యనవరతము పని చేయుచుండు నొక స్వాభావిక

యుక్తి, గురుత్వాకర్షణ శక్తివలె వర్ణధర్మము కూడ కను గొనబడని నాడును కలదు. ఈ న్యాయమును హిందువులు కనుగొనగలిగిరి. పాశ్చాత్యులు కొన్ని ప్రకృతి శాస్త్ర ములను కనుగొని వాని నుపయోగించుటచే సులభముగా తమ ద్రవ్య సంపత్తును పెంచకొన గలిగిరి. అదే విధముగ హిందువులీ తిరుగులేని సాంఘిక స్వభావమును కని పెట్టి ప్రపంచములోనే యితర జాతి సాధింప జాలని యాధ్యా త్మిక రంగమును సాధించిరి.

వర్ణమునకు, కులముతో సంబంధము లేదు. అస్పృస్యత వలెనే కులము హిందూ మతములో జేరిన చీడ. ఇప్పుడు ముఖ్యములని యెంచబడుచున్న చీడలన్నియు హిందూమత ములో నెన్నడు భాగములు కానేకావు. క్రైస్తవమతము ఇస్లాము మతములలో కూడ నిట్టి చీడ లెన్ని లేవు!

ఈ చీడలతో పోరు సలుపవలసినదే. వర్ణము యొక్క బురకాతో తాండవ మాడుచున్న కులరాక్షసిని రూపుమాప వలెను. హిందూ మతమును, భారతదేశమును అధఃపతితము గావించిన దీవర్ణముపేర చెలామణి 'చాటపెయ్య'. వర్ణధర్మ మును పాటింపజాలక పోవుటయే చాలావరకు మన యార్థిక ఆధ్యాత్మిక వినాశమునకు కారణము. మన దారిద్ర్యమునకు, నిరుద్యోగమునకు నిది యొక కారణము. అస్పృస్యతకు, మన మత భ్రష్టతకు నిదియే కారణము.

కాని యిప్పటి వికార రూపముతోను, వికృతాచారముల తోను జరుపు పోరాటములో మనము మన మూలధర్మము తోనే పోరు సలుప రాదు. దానిని విస్మరింపరాదు.

## అతని మతము

'నేను సనాతన హిందువును.' అని పదేపదే చెప్పు కొనుచు దాని కతడీ క్రిందికారణములను విశదీకరించువాడు.

1. వేదములు, ఉపనిషత్తులు, పురాణములు, హిందూ మతగ్రంథములు అను పేరు గలవానిని, అవతారములను, పునర్జన్మను నేను విశ్వసించెదను.

2. కేవల వైదికార్థములో చెప్పబడిన వర్ణాశ్రమ ధర్మములలో నాకు విశ్వాసము కలదు. కాని యిప్పుడు నామకార్థముగ పలువురిచే నంగీకరింప బడు శుష్కార్థమును నేను విశ్వసింపను.

3. 'గోసంరక్షణము' యిప్పుడున్న రీతిగగాక ప్రగాఢ భావములో నేనంగీకరింతును.

4. 'విగ్రహారాధన' లో నాకవిశ్వాసము లేదు.

5. అహింసా, సత్య, బ్రహ్మచర్య వ్రతములలో పరి పూర్ణత నొంది, సమస్తమును త్యజించిన వాడు కాని ధర్మ గ్రంథములలోని పరమార్థము నెరుంగ జాలడను హైందవ సూక్తిని నేను ముమ్మాటికి విశ్వసింతును.

౯. హిందువులందరి వలెనే నేను భగవంతు డున్నాడని, 'అతడొక్కడే యని' పునర్జన్మ కలదని, మోక్షము కలదని విశ్వసింతును.

వర్ణాశ్రమ ధర్మముకంటె కూడ 'గోసంరక్షణము' మూలముననే హిందూ మతములో తక్కిన యన్ని మతములలోను లేని విశిష్టత కలదు. మానవ ప్రకృతిలోనే వర్ణాశ్రమము కలదని నాయభిప్రాయము. హిందూ మతము దాని నొక శాస్త్రముగ రూపొందించినది. అదిపుట్టుకకు సంబంధించినది. నీ యిష్టము వచ్చినట్లు నీవు నీ 'వర్ణము' ను మార్చుకొనజాలవు. వర్ణము నతిక్రమించుట యనగా పైతృకన్యాయమును ధిక్కరించుటే యగును.

ఒక్క వేదములే దైవ నిర్మితములను దానిని నేను విశ్వసింపను. బైబిలు, ఖురాను, జెండా వస్త కూడ వేదముల వలె దివ్యస్ఫూర్తి కలిగియే యున్నవి. హిందూ మత గ్రంథములయందు నాకున్న విశ్వాసము వలన నేను ప్రతిపదము ప్రతి శ్లోకము దివ్య ప్రభావము కలిగి యున్నవని నమ్మవలసినదని యర్థముకాదు. ఈ యద్భుత గ్రంథములలో నున్న సమస్తము నేను సరాసరి చూచితినన జాలను. కాని యీ గ్రంథములలోని ప్రధానబోధకు చెందిన సత్యములను నేనెరుగుదునని, వానిని నేను భావించు చున్నానని చెప్పగలను. న్యాయమునకు, నైతికపథమునకు విరుద్ధమైన

యెట్టి పాండిత్య ప్రతిభగల వ్యాఖ్యానము నైనను నేనంగీక రింపజాలను.

అంతిరోభజనముల వలనకాని, యంతర్వివాహముల వలన కాని పుట్టుక వలన మానవునకు వచ్చు వర్ణస్వాస్థ్యము విధిగా చెడిపోవునని నేను భావింపను. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర అను నాలుగు విభాగములు మానవుని వృత్తికి సంబంధించిన నిర్వచనములు, అవి సాంఘిక సంపర్క మును నియమింపవు నిర్బంధింపవు ఆ విభాగములు ధర్మము లను నిర్వచించును. అవి హక్కులను ప్రసాదించుట లేదు. ఒకరికి యెక్కువ స్థానము యింకొకరికి తక్కువ స్థానము యిచ్చుట హిందూ మత సాంప్రదాయ విరుద్ధమని నాభా వన. జ్ఞానముచే బ్రాహ్మణుడు, రక్షణశక్తిచే క్షత్రియుడు, వ్యాపారదక్షతచేత వైశ్యుడు, శరీర పరిశ్రమచే శూద్రుడు, భగవత్సృష్టిని సేవించుటకే పుట్టిరి.

బ్రాహ్మణుడు శరీర పరిశ్రమ చేయనక్కర లేదని తనను యితరులను రక్షింప నక్కర లేదని దీని భావము కాదు. పుట్టుక వలన బ్రాహ్మణునకు జ్ఞానవిశిష్టత కలుగుటచే జన్మ సంస్కారము చేతను, శిక్షణ చేతను నతడు దాని నితరులకు బోధింప నర్హుడగుచున్నాడు. ఎంతటిజ్ఞానము నైనను సంపా దించుకొనుటకు శూద్రున కెట్టి యాంక్ష లేదు. శరీర పాటవముచేతనే యతడు విశిష్ట విశ్వసేవ చేయగలడు. సేవ

చేయుట కితరులకుగల ప్రత్యేకగుణముల కతడసూయ నొంద నవసరము లేదు. జ్ఞానముచే నధికుడనైతి ననిభావించు బ్రాహ్మణుడు పతితుడు. అతడు జ్ఞానము లేనివాడు. ఇది యితరులకును నట్లే వర్తించును. వర్ణాశ్రమ మనగా నాత్మనిగ్రహము; మన శక్తులను పొదుపు చేసుకొనుట, రక్షించుకొనుట.

అంతర్భోజనముల వలన నంతర్వివాహముల వలన వర్ణాశ్రమమునకు లోపము రాకపోయినను హిందూ మతము దీని నెంత మాత్రము ప్రోత్సహించుట లేదు. ఆత్మ నిగ్రహములో హిందూమతము చరమస్థాయి నందు కొనెను. అది విషయములను త్యజించి యాత్మ మోక్షమును కలుగజేయు మతము. కుమారునకు వివాహము చేయునపుడు దొక విభాగమును దాట రాదని నియమించుటలో నెంత యో నిగ్రహము చూపబడుచున్నది.

మోక్షమునకు వివాహ వ్యవస్థ ప్రధానమని హిందూ మతము చెప్పుట లేదు. 'జన్మ' యే పతనావస్థయై నట్లు వివాహము కూడ 'పతనమే'. మోక్షమనగా జన్మము మృత్యువు కూడ లేకుండ చేసికొనుటయే. అంతర్భోజనములను, అంతర్వివాహములను నిషేధించుట ముఖ్యావసరము. కాని యీ ఆత్మ నిగ్రహము వర్ణమునకు పరీక్ష కాజాలదు. జ్ఞానము ద్వారా సంఘమునకు సేవ చేయుట వీడనంత కాలము బ్రాహ్మణుడు తన శూద్ర సోదరునితో భోజనము చేసినను

బ్రాహ్మణుడే యగును. కనుక వివాహాదిక నిగ్రహములు న్యూనాధిక భావములతో చేయబడినవి కావు. అధికుడనను భావముతో నితరులతో భుజింప నిరాకరించు హిందువునకు హిందూమతము సరిగా నర్థము కాజాలదు.

దురదృష్ట వశమున నేడు హిందూ మతము 'తినుట' తినకుండుటగా మాత్రమే పరిణమించినది. అది తననిజ పరమార్థమును పోగొట్టుకొని భోజన ప్రతిభోజన నిషేధ తంతుగా మారినది. మాంస నిషేధము ఆత్మవికాశమున కెక్కువ సహాయకారియనుట నిస్సందేహము. కానియదియే గమ్యస్థానము కాదు. అందరితోను భోజనము చేయుచు మాంస వర్జనము చేయక పోయినను నిరంతరభగద్భక్తి తత్పరులగు వారు, మాంసాదికములను తినక ఇతరకఠోర నియమములను పాటించుచు తమ ప్రతిచర్యలోను భగవంతుని దూషించుచుండువారికంటె నెక్కువ మోక్షార్హులగు చున్నారు. 'గోసంరక్షణము' హిందూమతమున కాయువుపట్టు. మానవ వికాసమున కంతకు నిదియొక యద్భుత సాధన యని నా భావన. ఇది మానవుని తన జాతినుండి మరలించి భూత జాతి నంతను స్మరింప చేయుచున్నది గోవునే యిట్లు పూజింప నేల యన భారత దేశమున గోవే యుత్తమోత్తమ సహకారి. అది కామధుక్. అది క్షీరములనేగాక భారత దేశ వ్యవసాయ కామధేనువు. గోవు కరుణాస్వరూపిణి

ఈ సాధు జంతువు కరుణనే వర్షించును. భారత దేశములో నిది కోట్లకొలది మానవులకు 'మాత' గోసంరక్షణ మనగా భగవత్సృష్టిలోని నోరు లేని జంతు సంతతిని రక్షించుట ప్రాచీన ఋషులు, భారత దేశమును గోవుతోనే ప్రారంభించిరి. నోరులేనివి కనుక భూతజాతి గోడు మరింత యాదరణీయమైనది. 'గోసంరక్షణము' హిందూమతము ప్రపంచమున కర్పించిన గొప్పవరము. గోవును సంరక్షించు హిందువులున్నంత కాలము హిందూమతము వర్ధిల్లును.

నా భార్య యెడల నాకు గల భావమును నెట్లు వర్ణింపజాలనో యట్లే హిందూమతము నందు నాకుగల భావమును వ్యక్తీకరింపజాలను. ప్రపంచములో నేయితర స్త్రీ కదల్చజాలనట్లు నన్నామె కదల్చివేయును. ఆమెలో దోషములు లేవని కాదు. నేను చూడని దోషము లామెలో ననేకములున్నవి. కాని మామధ్య నొక యవినా భావసంబంధము కలదు. ఈ విధముగనే హిందూమతములో ఎన్ని దోషములు, సంకుచిత మార్గములున్నను నేను దానిని వీడజాలను. గీతాగానము, తులసీ రామాయణా మృతస్వాదనము వలె నాకేవియు పరవశత్వము కలిగింప జాలవు. హిందూమతములో నీ రెండు పుస్తకములను మాత్రమే నేను నిజముగా నెరుగుదును. ఒకసారి నేను చనిపోవుదు ననుకొని నపుడు గీతయే నాకాత్మ శాంతి నిచ్చెను.

అన్ని గొప్ప గొప్ప హిందూ దేవాలయములలో నేడు జరుగుచున్న పాపమును నేనెరుగుదును. కాని వచింపలేని దోషము లున్నను నేను వాటిని ప్రేమింతును. నాకు వాటి యందుగల సంబంధ మితర గుడులతో లేదు. నేను ముమ్మాటికి సంస్కార ప్రియుడనే. కాని నాసంస్కారా వేశము హిందూమత పరమ ప్రయోజనములను వేటిని తిరస్కరింపదు.

విగ్రహారాధనలో నాకవిశ్వాసము లేదని నేనంటిని. విగ్రహము నాలో పూజ్యభావమును రేకెత్తింపదు. కాని విగ్రహారాధన మానవ స్వభావములో నొక భాగమని నాభావము. మన మొక చిహ్నము కొరకు చూచుచుందుము. ఇతర చోట్ల కంటె గుడిలోనో లేక చర్చిలోనో మనకు మనశ్శాంతి కలుగనేల! విగ్రహములు పూజ సల్పుటకు సహాయకారులు. విగ్రహమే దైవమని యేహిందువు భావింపడు విగ్రహారాధన పాపమని నేను భావింపను.

హిందూమతమే యితర మతమును దూరకరించు మతము కాదని పైవాని వలన విశదమగుచున్నది. ప్రపంచ మత ప్రవక్తల నందరను పూజించుట కందులో స్థానము కలదు. మామూలు భాషలో నది మిషనరీ మతము కాదు. అది యనేక తెగలను తన యావరణలో నిముడ్చుకొనెను. కాని యిట్లిముడ్చుకొనుటలో నది పైకి కాన్పించని వికాస గుణ

మునకే స్థానమిచ్చు చున్నది. తన విశ్వాసము ప్రకారమే భగవంతుని ప్రార్థింపుడని హిందూమతము ప్రతిమానవు నకు బోధించుచున్నది, కనుక నది యన్ని మతములతోను సహానము కలిగి జీవించుచున్నది.

హిందూమతమును గురించిన నాభావములిట్లుండ నేను 'అస్పృశ్యత' యను దాని నర్థము చేసికొనలేకున్నాను. అది యొక చీడయనియే నేనెల్లపుడు భావించితిని. ఇది తర తరముల నుండియు వచ్చుచున్న సంగతి నిజమే. నేటివరకు ననేక దురభ్యాసము లిట్లే పొర్లివచ్చు చున్నవి. భోగకన్యక లను కేవల వ్యభిచారమునకు నియమించుట హిందూమత ములో నొక భాగమటనుకు నేను సిగ్గిల్లుచున్నాను. కాళికా దేవికి మేకలను బలివేయుట కేవలము మత విరుద్ధమని నేనం దును. అది హిందూ మతములో నొక భాగము కాజాలదు. ఒకప్పుడు మతము పేరిట జంతు బలులు జరిగినమాట నిజము. కాని యది నిజమైన మతము కాదు; హిందూమత మంతకు మునుపే కాదు.

'గోసంరక్షణము' ను మన ప్రాచీను లొక మత విశ్వా సముగ నంగీకరించినపుడు గోమాంస భక్షణమును వీడని వారిని బహిష్కరించి యుందురు. అపుడంతః కలహములు భయంకరముగ నుండి యుండవచ్చును. సంఘ బహిష్కా రము వారి మీదనే కాక వారివారి మీదకూడ ప్రయోగింప

బడెను. సదుద్దేశ్యములతోనే ప్రారంభింపబడిన బహిష్కారము కఠువుగట్టి కఠోరమైన యాచారమై దానికొరకు శ్లోకములు కూడ మన మతగ్రంథములలోనికి చొచ్చుకొని వచ్చెను 'అస్పృశ్యత' కిది కారణమని నా సిద్ధాంతము. ఇది సరియైనను కాక పోయినను 'అస్పృశ్యత' న్యాయ విరుద్ధము; కరుణా ప్రేమ స్వభావములకు గొడ్డలిపెట్టు. గోపూజను ప్రతిష్ఠించిన మతము క్రూరము, అమానుషము నగు మానవ బహిష్కారమును శాసింపదు, ప్రోత్సహింపదు. నేను అస్పృశ్యులను వారి కర్మకు విడిచి వేయుట కంటె ముక్కలు క్రింద కోయబడుటకైన నంగీకరింతును- ఉదారమైన తమ మతమునుండి అస్పృశ్యతను తొలగింపనంత కాలము హిందువులకు స్వాతంత్ర్య మబ్బదు; వారు దాని కర్హులు కాజాలరు. ప్రాణముకంటే కూడ నాకు హిందూమత మతిప్రీతిదాయకమగుటచే నాకీమచ్చ సహింపరాని భారమైనది. మన జాతిలో నయిదవ వంతుకు మనతో కలిసి జీవించుహక్కు తీసివేసి దైవమునే తిరస్కరింపకుందుముగాక!

# భగవంతుడు అవ్యక్తుడు

పై విషయమును గురించి మహాత్ముడీ విధముగ చెప్పెను—

"ఈ విశ్వము నంతను వ్యాపించియున్న అనిర్వాచనీయమైన శక్తి యొకటి కలదు. నేను దానిని చూడలేక పోయినను దాని ననుభవించుచున్నాను. ఈ యదృశ్యమగు శక్తి ఋజువులకు గోచరము కాక యనుభవింపబడగలదు, ఏలన నది నాయింద్రియములకు గోచరమగు వస్తువంటిది కాదు. అది యింద్రియాతీతము. కాని యతడున్నాడని యుక్తి యుక్తముగ చూపుటకు కొంతవరకు వీలగును.

నిత్య వ్యవహారములలో కూడ ప్రజలకు తమ్మెవరు పాలించుచున్నారో యెట్లు యెందులకు పాలించు చున్నారో తెలియక పోయినను తమ్ము పాలించుచున్న యధికార మొకటి నిశ్చయముగా కలదని తెలియును. నేను గత వత్సరము మైసూరులో సంచారము చేయునపు డనేక మంది బీద గ్రామీణులు తమ్ము పాలించు చున్న రాజెవరో తెలియ దనియు నేదేవుడో మాత్రము పాలించుచున్నా డనియు చెప్పిరి. తమ రాజునుగురించి యీ బీదప్రజల జ్ఞాన మంత యల్పమే యైనప్పుడు రాజులకు రాజైన దైవమును గురించిన నాజ్ఞాన మత్యల్పమగుటలో నాకాశ్చర్య మేమియు కన్పింపదు.

అయినను మైసూరులోని బీద గ్రామీణులు మైసూరు ప్రభువును గురించి భావించునట్లే నేనీ విశ్వములో నొక క్రమము కలదని భావించుచున్నాను. జీవించుచున్న సమస్తమును ప్రతి జీవిని పాలించుశక్తి యొక్క అప్రతిహత న్యాయము కలదు. అది గ్రుడ్డి న్యాయము కాదు. ఏలన జీవజంతువులనే గుడ్డి న్యాయము పాలింప జాలదు. జె. సి. బోసుగారి ధర్మమా యని వారి పరిశోధనల వలన పదార్థము కూడ ప్రాణమే యని ఋజువైనది. కనుక ప్రాణ సముదాయమునంతను పాలించు న్యాయమే దైవము. ఈన్యాయమును, దీనిని ప్రసాదించిన వాడు వర్ణ్యాతీతములు. నాకతి స్వల్పమే. వాటిని గురించి తెలియనంత మాత్రమున నవి లేవని నేననరాదు. దేశమును పాలించు రాజు లేడనినను, అది నాకు తెలియదనినను నాకెంత ప్రయోజనమో దేవుడు లేడని, యతని పాలన లేదని నేననినంత మాత్రముచేత నేనా న్యాయమునుండి తప్పించుకొనజాలను. రాజును అంగీకరించి జీవించుటెట్లో యట్లే దివ్యప్రభావమును నమ్ర శిరస్కులమై యంగీకరించుచో జీవిత యాత్ర సుఖతరముగ జరుగును.

నాచుట్టు నున్న సమస్తము నిత్యము మారుచు నిత్యము చచ్చుచున్న యీ సమస్త మార్పులకు నట్టనడుమున మార్పు నొందక సృష్టి, స్థితి, లయములకు మూలమైన చైతన్య

శక్తి యొకటి కలదని నాకు స్పష్టముగా ద్యోతకమగు చున్నది. ఆ సర్వజ్ఞ శక్తిలేక తత్త్వమే దైవము. నేను నా యింద్రియములతో మాత్రమే చూడగల దేదియు స్థిరముగ నుండుట లేదు కనుక నతడొక్కడే సనాతనుడు.

ఈ శక్తి కళ్యాణ ప్రదమైనదా లేక దుష్టమైనదా? అది కేవలము కళ్యాణ ప్రద మైనదే యని నాకు కాన్పించు చున్నది. ఏలన మృత్యు మధ్యమున జీవితము సాగుచున్నది. అ సత్యము మధ్య సత్యము ద్యోతక మగు చున్నది. అంధకార బంధురములో జ్యోతి వెలుగుచున్నది. కనుక భగవంతుడు సత్యమని, చైతన్యమని, జ్యోతి యని నేను గ్రహించితిని. అతడు ప్రేమస్వరూపుడు. అతడు పరమ కళ్యాణమూర్తి.

కాని కేవలము బుద్ధినే సంతృప్తిపరచునతడు (అట్టి వాడున్నచో) దైవమే కాడు. హృదయమును పాలించుచు దానిని మార్పు నొందించువాడే దైవము. అతడు తనభక్తుని ప్రతి చిన్న చర్యలోను ద్యోతకము కావలెను. పంచేంద్రి యముల జ్ఞానముచే నెన్నడు గ్రహింపబడజాలని నిశ్చితమైన యతీంద్రియ జ్ఞానము మూలముననే యిది జరుగును పంచేంద్రియజ్ఞానమెంత నిజముగా కన్పించినను నది మభ్య పరచుచు సత్యదూరముగ నుండును. ఇంద్రియముల కతీత మైన యే జ్ఞానముకలదో యదియే దోషరహితమైనది.

అది బాహ్యసాక్ష్యముల చేత ఋజువగునది కాదు. అంతరంగమున భగవంతుని సాక్షాత్కరించుకొనినవారి శీలసామాగ్రి చేతనే యది ఋజువు కాగలదు.

అట్టి సాక్ష్యమన్ని దేశములలోను, నన్ని కాలములలోను నవిచ్ఛిన్నముగ ప్రభవించుచు ఋషిపరంపరయొక్క యనుభవములలో లభ్యము కాగలదు. ఇట్టి సాక్ష్యమును కాలదన్నుట తన్ను తాను వశింపుజేసికొనుటయే. ఈజ్ఞానము వెనుక నచంచలమగు విశ్వాసముండును. భగవంతుని యునికిని స్వయముగ పరీక్షింపగోరు వానికి తీవ్రమైన విశ్వాసముండవలెను. విశ్వాసము బాహ్యసాక్ష్యముచే ఋజువుకాదు. కనుక ప్రపంచమును పాలించు నైతిక ప్రభుత్వమును విశ్వసించుటయే భద్రమార్గము. అనగా దయా, సత్య, ధర్మముల యాధిక్యత నంగీకరింపవలెను. దయా సత్యములకు విరుద్ధమైన దానిని తిరస్కరింపవలసిన నిశ్చయము కలిగిననాడు విశ్వాసమును పాటించుటయే శుభకరము.

తర్కము ద్వారా నేను విశ్వాసమును పురిగొల్పజాలను. విశ్వాసము తర్కమున కతీతమైనది. దుస్సాధ్యమైన దాని కొరకు యత్నింపవలదనియే నా సలహా. పాపమెట్లు కలుగుచున్నదో నేను తర్కముచే స్థాపింపజాలను. అట్లు చేయబూనుట భగవంతుని సర్వజ్ఞత్వము నాకు కలదనుకొనుటయే

యగును. కనుక వినమ్రతతో నేను చెడుగును గ్రహించెదను. ప్రపంచములో చెడుగును అంగీకరించుచున్నాడు. కనుక నే భగవంతుడు క్షమా స్వరూపుడని చిరకాలమునుండి తపించుచున్నాడని నేనందును. అతనిలో చెడ్డలేదని నేనెరుగుదును. అట్లుకాక చెడ్డయేయున్నచో దాని కతడే మూలము కనుక నది యతని నంటదు. ప్రాణమును పోగొట్టుకొనవలసి వచ్చినను. చెడుగుతో పోరాడిన కాని నేను భగవంతుని తెలిసికొనజాలనని కూడ నాకు తెలియును. నా స్వల్పమైన పరిమిత యనుభవముచే నాయీ విశ్వాస మొక కోటయైనది. నేనెంత పవిత్రుడనగుటకు ప్రయత్నించుదునో భగవంతున కంతదగ్గర యగుచుందునట్లు భావింతును.

నేడు నా విశ్వాస మాభాస మాత్రముగానే యున్నది. ఇట్లు గాక నది హిమాచలమువలె నచంచలముగను, వాటి శిఖర ధావళ్యమువంటి ధావళ్యముతో నున్నచో నేను భగవంతుని కింకను. నెంత సన్నిహితునిగ నుండెడివాడనో! అంతవరకు న్యూను మహాశయుడు గానము చేసినట్లు నేనిట్లు ప్రార్థింతును.

ఓ పరంజ్యోతీ! ఈ యంధకారబంధురమునుండి నన్ను ముందుకు తీసికొని పొమ్ము. ఈ యామము తిమిరాతితిమిరముగనున్నది. నేనో! నా యింటికి కడు దవ్వులోనున్నాను. నన్ను ముందుకు నడిపింపుము. నేనొక్క యడుగు ముందుకు

పోయిన త్రాలును దూరాతిదూరమున నున్నదానిని నేను చూడగోరుటలేదు. తడబడు నాపదములకు స్థైర్యము నిప్పింపుము.

"భగవంతుడు ప్రేమస్వరూపుడు, సత్యస్వరూపుడు; అతడు నైతిక ధర్మ స్వరూపుడు; అభయమూర్తి; అతడు జ్ఞాన చైతన్యమూర్తి; అతడే యన్నిటికి నతీతుడు. అతడు అంతరాత్మ. నాస్తికుని లోని నాస్తికత్వము కూడ నతడే. అపరిమేయ ప్రేమ స్వరూపుడైన భగవానుడు తన ప్రేమచే నాస్తికుని కూడ జీవింపనిచ్చుచున్నాడు. అతడు హృదయ శోధకుడు; వాగతీతుడు, తర్కాతీతుడు, మనలను, మన హృదయములను మన కంటె నతిడెక్కువగా నెరుగును. మన మాటలను బట్టి యతడు మనలను లెక్కగట్టడు. ఏలన బుద్ధిపూర్వకముగ గాక, యబుద్ధిపూర్వకముగగాని తరచు మనమర్థము లేకుండగనే మాట్లాడుచుందుమని యతనికి తెలియును. అతని మూర్తి చూడ కోరికగలవారి కతడు మూర్తివంతుడు అతని స్పర్శను వాంఛించువారి కతడు శరీర ధారి. అతడందరికి నన్నిరూపుల గోచరించువాడు. అతడు మనలో నున్నాడు. అంతే కాక నతడు మన పైన వెనుక కూడనున్నాడు. 'భగవంతుడు అను పదమును బర్తరపుచేసి మానవుడు ప్రగల్భములు కొట్టవచ్చును. కాని భగవంతుడను వస్తువును తీసివేయుటకు మానవునకెట్టి శక్తియు లేదు.

భగవంతుని పేర నసేక యవి నీతి పనులు, అమానుష రాక్షస కృత్యములు జరుపబడినంత మాత్రముచేత నతని యునికికి భంగములేదు. అతడు క్షమాస్వరూపుడు చిరంతపుడు. కాని యతడు భయంకరావతారము దాల్చగలడు. ఈలోకమందు పరలోకమందు కూడ నతడు దండధరుడు. మనము మనతోడి వారిని, తోడి భూత సంతతిని యెట్లు చూతుమో యట్లే యతడు మనలను చూచును. అజ్ఞానము నతడు క్షమింపజాలడు. కాని యతడెప్పుడును దయను చూపుచుండును. ఏలన పరితాపమున కతడు చెవియొగ్గును. అతడు ప్రపంచములో నందరి కంటె గొప్ప ప్రజాస్వామి. మంచి చెడుగులను నిర్ణయించుకొనుట కతడు మనకే సంపూర్ణావకాశము నిచ్చుచున్నాడు. అతడతి నిరంకుశుడు. ఏలన యతడు తరచు మన నోటిదగ్గరకు వచ్చిన దానిని లాగివేసి సర్వస్వతంత్రుడు కనుక మనలను కడు దరిద్రులను చేసి తన మహిమ ప్రకటించును. అది యతని కానందము, మనకు దుఃఖము. కనుకనే హిందూమతము దాని నతని వీలులేక మాయయనును. అతడొక్కడే యున్నాడు. మనములేము.

"భగవంతుని పూజించుట యనగా నతనిని స్తవము చేయుట. ప్రార్థించుట యనగా మన యసహాయతను, యశక్తతను అంగీకరించుట. భగవంతునకు వేలకొలది

పేరులుకలవు. కాదు. కాదు. అతడు నామరహితుడు. మనకిష్టము వచ్చిన పేరుతో మన మతనిని పూజింప వచ్చును; ప్రార్థింపవచ్చును. అతనిని కొందరు రాముడని, కొందరు కృష్ణుడని, మరి కొందరు భగవంతుడని పిలుతురు. అందరును ఒక తత్త్వమునే యారాధింతురు. కాని యొకే యాకార మందరికి భర్జించనట్లు అన్ని పేర్లు నందరికు సరిపడవు. ప్రతివాడు తనకున్న సంపర్కములను బట్టి నామమును వరించును. అతడంతర్యామి, సర్వశక్తివంతుడు, సర్వజ్ఞుడు కనుక మన యంతరంగ భావములను గ్రహించి మనయర్హతలకు దగినట్లు ప్రసాదించును.

కనుక పూజ, ప్రార్థనము పెదవులతో చేసిన చాలదు. వాటిని హృదయముతో చేయవలెను. కనుకనే మూగవాడు, నత్తివాడు, తెలియనివాడు, మూర్ఖుడు మరెట్టివాడైనను నతనిని సమముగనే ప్రార్థింపవచ్చును. నాలుక ద్వారా యమృతమునే చిలుకుచు హృదయము విషపూరితమైన వారి ప్రార్థనల నతడెన్నడు వినడు. కనుక భగవంతుని ప్రార్థింపదలచుకొనువాడు మొదట తన హృదయమును పవిత్ర మొనరించుకొనవలెను. రామనామము హనుమంతుని పెదవులమీదనే గాక హృదయ సింహాసనమున కూడ నధిష్ఠించెను. రాముడు హనుమంతున కక్షయబలము

నొసంగెను. రాముని బలముతో హనుమంతుడు సముద్రమును తరించెను. పర్వతమును పెకలించెను. విశ్వాసము చేతనే మనము సంక్షుభిత సాగరములను తరింప వచ్చును. విశ్వాసమే పర్వతములను తరల్చుచున్నది. విశ్వాసమే సముద్రమును లంఘించుశక్తి నిచ్చుచున్నది. అంతరంగమున చైతన్యవంతమై దేదీప్యమానముగ నుండు భగవత్స్మృతియే యావిశ్వాసము కాని మరొకటికాదు. అట్టి విశ్వాసమును సాధించిన వానికేమియు నక్కర లేదు. కాని హృదయము నింత పవిత్రవంతముగ చేయుటెట్లు? నిజమైన భక్తుడొక్కనికే యిది తెలియును. అతడే దానిని బోధింపగలడు. గీత నిజ భక్తుని గురించి మూడు చోట్ల నిర్వచించి యతనిని గురించి సామాన్యముగ ప్రతి చోటను టంకించెను. కాని భక్తుని నిర్వచనమును గురించిన జ్ఞానము మాత్రమే మనలను నడుపజాలదు. అట్టి వారీ ప్రపంచములో బహు అరుదుగ నున్నారు. కనుకనే నేను సేవయను మతమునొక సాధనగా సూచించితిని. తన తోడివారిని సేవించు వారి హృదయ పీఠమునే భగవంతుడు తనకు తానై వలచి వరించును.

కనుకనే 'ఋషి-జ్ఞాని' యగు కవి 'యితరులదుఃఖమును చూచి ద్రవించువాడే నిజమైన వైష్ణవుడు' అనిస్తవము చేసెను.

# మతము - రాజకీయములు

ఎంతటి మహనీయుడైనను నతని కార్యములు స్పష్టమైన మత పునాదులమీద నాధారపడిన కాని రాణింపజాలవు. కాని మత మనగా నేమి? దీనికి నేనే జవాబు చెప్పెదను 'ప్రపంచ మత గ్రంథము లన్నింటిని చదివినచో కలుగు మతము మతముకాదు. బుద్ధిచే గ్రహింపబడునది నిజముగా మతముకాజాలదు. హృదయముచే గ్రహింప బడునదియే మతము.'

మతము మన కన్యవిషయముకాదు. దానిని మనము మనలో నుండియే వికసింపజేయవలెను. అదిసదా మనలోనే కలదు. కొంతమందిలో అదిప్రస్ఫుటముగను మరికొంత మందిలో తెలియకుండగను నుండును. కాని అది సదా మనలోనే యుండును. మనము మనలోనున్న యీమత స్వభావమును బాహ్యసహాయ్యము చేతగాని యంతరంగ వికాసము చేతగాని పొందవచ్చును పొందక తప్పదు. మన మేపనిని యుక్తముగ చేయదలచినను శాశ్వతముగ నుండు దానిని సాధింప దలచినను యిదియే మార్గము. మన మతగ్రంథములు మానవ జీవితమునకు సంబంధించిన కొన్ని సూత్రములను నిరూపించినవి. ఈ సూత్రముల ప్రకారము జీవించినకాని మనకు మతము యొక్క నిజదర్శనమే లభింపదని వారు చెప్పిరి. నాకు వీనియందు కుంఠిత విశ్వాసము కలదు.

# సత్యవ్రతము-(ఆశ్రమ నియమములు)

సత్యమనగా మనము మామూలుగా నర్థము చేసికొను నది కాదు; 'నిజాయితీ యుత్తమనీతి' యనునదియు కాదు. ఏలన నదియుత్తమమైనది కానిచో మనము దానిని విడ నాడవచ్చునను భావము కలదు. ఇచ్చట సత్యమనగా నెంతటి కష్టము నష్టము దాపురించినను మన జీవితమును మన మీ సత్యమార్గమున నడుపుకొనవలెను. ఈ నిర్వచన మును స్పష్టపరచుటకు నేను ప్రహ్లాదుని దివ్యజీవిత సాదృశ్య మును మీకు చూపుదును- సత్యము కొరకతడు తనతండ్రినే ధిక్కరించెను. కాని యతడెన్ని కష్టములనైనను తానే మంద హాసముతో భరించును కాని తండ్రి నెన్నడును ముట్టనాడడు. చివరకు సత్యమే జయించును. ఎప్పటికైనను సత్యమే జయించుట నిజమేయైనను యతడందు కొరకే యట్లు చేయ లేదు. కష్టపరంపరలమధ్య చనిపోయినను నతడు సత్యమును వీడడు నేను అట్టి సత్యమునే యనుసరింప గోరుదును-

## అహింస

అహింస యనగా 'చంపకుండుట' యని శబ్దార్థము. కాని నాకందులో ప్రపంచ విస్తృతికల యర్థము స్ఫురించు చు నన్నింకను యున్నతోన్నత లోకములకు గొంపోవును.

నీవెవరి యెడల నపచారము చేయరాదని దాని నిజభావము నీ శత్రువుపట్ల కూడ నీకు రసార్ద్ర భావమే యుండవలెను. ఈ సిద్ధాంతము నాచరించువానికి శత్రువే యుండడు. లోకములో నట్టివానిని శత్రువుగ పరిగణించువారు కూడ నుండ వచ్చును. కనుకనే యట్టివారి యెడల కూడ చెడ్డభావముండ రాదు. దెబ్బకు దెబ్బతీయుట అహింస కాదు. అంతేకాక స్నేహితుడుకాని శత్రువు అనబడువాడుకాని చేసినదానికి వైరము బూనరాదు. అనగా మనము దానికి లొంగిపోవల సినదని నా భావము కాదు. 'వైరము' అనగా శత్రువుకేదో యపకారము జరుగవలెనని కోరుట, లేక మన చేష్టలవలన కాకపోయినను, నితరుల చేష్టలవలన లేదా దైవము వలన నతనికేదో చెరుపు కావలెననుట - ఇట్టి భావములు కూడ అహింసకు దూరమే యగును.

## బ్రహ్మచర్యము

జాతీయసేవ చేయగోరువారు లేదా నిజమైన మతజీవితా నందము ననుభవింప గోరువారు వివాహితులైనను అవివా హితులైనను బ్రహ్మచర్యవ్రతమును పాలింపవలెను. వివా హము స్త్రీని పురుషునకు సన్నిహితము చేయును. వారీ జీవితములోను రానున్న జీవితములలోను కూడ యెడబాటు నెరుగని స్నేహితులు (ప్రత్యేకార్థములో) అగుదురు. వివా

హాము గురించిన మన యాశయములలో కామమునకు స్థానము లేదని నేననుకొందును-

# జిహ్వను కట్టిపెట్టుట

జిహ్వను కట్టినవాడు జంతు స్వభావమును సులభముగా జయింపవచ్చును - ఇది బహుకష్టతరమైన వ్రతములలో నొకటి - రాగాదులను ప్రకోపింపజేయు తీక్ష, రూక్ష, విదాహి పదార్థములను విడిచిపెట్టినకాని మనల ననవసరముగ, వ్యర్థముగ నుడికించు కామాది వికారములను జయింపజాలము. మనమట్లు చేయమేని భగవంతుడు మనకు ప్రసాదించిన యీ పవిత్ర శరీర ధర్మకర్తృత్వమును దూషించి, తినుట, త్రాగుట, భోగించుట మొదలగు రాగములకు దాసులమై పశువులకంటె నధఃపతితులమగుదుము. మనవలె జిహ్వను దూషించు గుఱ్ఱమును, గోవును నీవెన్నడైనను చూచితివా! ఈ మధుర పదార్థ రుచులను పెంచుకొనుచు మనమెక్కడనున్నారమో యను విషయమును విస్మరించి యీ భక్ష్యములను గురించి ప్రకటనలు చేయు వార్తా పత్రికల కొరకు పిచ్చిగా పరుగులెత్తుట నాగరిక లక్షణమని, యథార్థజీవిత చిహ్నమని భావింతువా?

# అస్తేయము

ఒక విధముగ మనమందరము దొంగలమే. నాకవసరమగు దానికంటె నధికముగ తీసికొని దాచుకొందునేని నేను దాని నితరులనుండి తస్కరించినవాడనే యగుదును. మనకు నిత్యము కావలసిన దానిని ప్రకృతి తయారుచేయుచుండును. అది ప్రకృతియొక్క ప్రాతిపదిక సూత్రము - దీనికి తిరుగు లేదు. ప్రతివాడు తనకు కావలసినంత మాత్రమే తీసికొనుచు నంతకంటె నెక్కువగ తీసికొననిచో నీ ప్రపంచములో దారిద్ర్య మెచ్చటిది ? ఆకలిబాధచే చనిపోవువాడెవ డుండును ? నేను సామ్యవాదిని కాను. ఆస్తిపాస్తులున్న వారిని లేకుండ చేయగోరుటలేదు. కాని యంధకారమును వీడి జ్యోతిని చూడగోరువారిని నీసూత్రము ననుసరింప గోరుచున్నాను. నేనెవరి ఆస్తులను లాగికొనగోరను. అప్పుడు నా దౌర్జన్యరాహిత్య సూత్రమే పోవును. నాకంటె నధికముగా నొకరికుండినచో నుండనిమ్ము. కాని నా జీవితమును నడుపుకొనుటకు నాకక్కరలేనిదానిని నేనుంచుకొనను. భారతదేశములో నొంటిపూట మాత్రమే తినువారు కోట్లకొలది కలరు. అది కూడ చమురులేని చపాతి, చిటికెడు ఉప్పు, వీరికన్నవస్త్రములు కల్పించు వరకు మనమేమియు (ఆశ్రమవాసులు) నుంచుకొనుటకు హక్కులేదు.

# స్వదేశీ వ్రతము

స్వదేశీ యవసరమైన వ్రతము. మన కోరికలను తీర్చు కొనుటకు సన్నిహితులను విడిచి యెచ్చటకో పరుగెత్తుట మన జీవిత పవిత్రధర్మములలో నొకదానిని ధిక్కరించుటే యగును. నీ సమీపముననే పుట్టి పెరిగిన యొక వర్తకుడున్నప్పుడు బొంబాయి వర్తకుడు వచ్చి నీకు సరకులనిచ్చుచో నీవు వాని వద్ద కొనుట ధర్మము కాదు. ఇది స్వదేశీయని నా భావము. నీ గ్రామములో నున్న మంగలిని వీడి మద్రాసునుండి వచ్చిన వానిచే నీవు చేయించుకొనరాదు. కావలసినచో నీ మంగలికి తగిన శిక్షనిప్పింపవచ్చును; చెన్నపట్టణము పంపవచ్చును. భారత దేశములో దొరకని వెన్నియో యున్నచో మన మవి లేకుండగనే గడుపుకొనుటకు ప్రయత్నింపవలెను. అనేక వస్తువులు లేకుండగనే మనము జీవింపవలసి యుండును. ఇట్టి మన స్తత్వము కలిగి యుందుమేని 'యాత్రికుని యభ్యుదయము' అను నపూర్వ పుస్తకములోని యాత్రికునివలె మన నెత్తిమీది భారము తీసివేయబడినట్లు మన మనుభవింతుమని నేను చెప్పగలను. ఆ యాత్రికుడు మోయు భారము తెలియకుండగనే పడిపోవును. అతడు తన యాత్రను సాగించుటకు పూర్వమున్న స్వేచ్ఛను మించి యనుభవించును. ఈ స్వదేశీ జీవితమును పూనినపుడు మీరిప్పటికంటె నెక్కుడు స్వేచ్ఛ ననుభవింతురు.

# అభయము

స్వతంత్రత్వమును తెచ్చిపెట్టి నభయము నా దేశమునా వేశించినట్లు నా భారత దేశ పర్యటనలలో నేను కనుగొంటిని. బహిరంగముగ మనము మన పెదవులను విప్పరాదు. మన భావములను రహస్యముగ మాత్రమే చెప్పుకొనవచ్చును. నాలుగు గోడల మధ్య మనమేమైనను చేసికొనవచ్చును. కాని వానిని ప్రజలలో మాత్రము పెట్టరాదు. మనము మౌనవ్రతమవలంబించినచో నా కెట్టి యభ్యంతరము లేదు. ఒక్క భగవంతునికి మాత్రమే జడియవలెనని నేను మీకు సూచించుచున్నాను. భగవద్భయమున్ననాడు మనమిక నే మానవునకు భయపడవలసిన పని లేదు. అతడెంతటి హోదా కలవాడైనను భయము లేదు. సత్యవ్రతము నవలంబించుటకు నిర్భయత్వమత్యావసరము. భారతమోక్షమును సాధింప బూనుటకు ముందు మన మీ నిర్భయత్వము నభ్యసింపవలెను.

# అస్పృశ్యత

హిందూ మతమునకు నేడొక తీరని కళంకము పట్టినది. ఇది యనాదిసిద్ధముగా మనకు వచ్చుచున్నదను విషయమును

నేనంగీకరింపజాలను. అసహ్యాకరము, దుఃఖదాయకము, హానిసత్వమును కలిగించునది యగు 'అంటరానితనము' అను తత్త్వము మన మతి నికృష్ట స్థితికి దిగిపోయినపుడే మనకు ప్రాప్తించినదని నా యభిప్రాయము. ఈ దౌష్ట్యము జిడ్డువలె పట్టుకొని మనలనింకను విడిచిపెట్టకున్నది. ఇది యొక పాతకమని నా భావము. దీని మూలముననే యీ పవిత్రభూమి యనేక శిక్షలకు గురియగుచున్నదని నేను తలంచెదను. వృత్తిని బట్టి యెట్టివానినైనను అంటరానివాడని భావించుట నాకెన్నటికిని యర్థము కాదు.

## దేశభాషలద్వారా విద్య

యూరపు దేశములో ప్రతి విజ్ఞానవంతుడు తన భాషతో పాటు యితర భాషలను నేర్చుకొనును. భారత దేశము లోని భాషా సమస్యను పరిష్కరించుటకాశ్రమ వాసుల మైన మనము వీలైనన్ని దేశభాషలను నేర్చుకొనవలెను. ఇంగ్లీషు భాషను నేర్చుకొను కష్టముతో పోల్చినచో నిది యొక కష్టమే కాదు. మన జ్ఞప్తినుండి మన శైశవ సంవత్స రముల నెట్లు తుడిచివేయగలము? విదేశ భాషద్వారా మనమున్నత విద్యను ప్రారంభించినపుడు మన మీ పనియే చేయుచున్నాము. దీని వలన నొక యంతరాయమేర్పడు చున్నది. దాని ఫలితము మనమనుభవింపక తప్పదు.

# ఖద్దరు వ్రతము

'మన చేతులను మన మెందు కుపయోగింపవలెను?' అని మీరడుగవచ్చును 'చదువురానివారే శరీర కష్టము చేయవలెను. నేను సాహిత్యమును, రాజకీయ వ్యాసములను చదువుకొనుచు కాలము గడిపెదను' అని మీరనవచ్చును. పరిశ్రమించుటలోనున్న గౌరవమును మనము గుర్తింపవలెను. క్షురకుడు లేక చమారీకళాశాలలలో చదువుచున్నంతమాత్రమున తనవృత్తిని వీడనక్కరలేదు. వైద్య మెట్టి వృత్తియో యివియు నట్టివేయని నా భావము.

# రాజకీయములు - మతము

మతవిరహితములైన రాజకీయముల కెంతమాత్రము అర్థములేదు. విద్యార్థులు రాజకీయ వేదికలను నింపుట జాతీయాభివృద్ధికి చిహ్నమని నేను భావింపజాలను. అనగా మీరు విద్యార్థిదశలో రాచకీయములను గురించి యధ్యయనము చేయరాదని నా భావముకాదు. రాజకీయములు మన జీవితములలో నొక భాగము. మన జాతీయసంస్థలను గురించి మనము తెలిసికొనక తప్పదు. మనమీపనిని చిన్నతనము నుండియు చేయవచ్చును. కనుకనే ఆశ్రమములోని ప్రతి బిడ్డకు మన జాతీయసంస్థల చరిత్రలు బోధింపబడుచు జాతి నూతనాశయములతోను, నూతన చైతన్యముతోను, నూతన

భావములతోను నెట్లు స్పందించుచున్నదో విశదీకరింపబడు చుండును. కాని మత విశ్వాసమునకు సంబంధించిన స్థిరమైన జ్యోతి, తిరుగులేని జ్ఞానముకూడ మనకు కావలయును. కేవలము బుద్ధినే తృప్తిపరచు విశ్వాసముకాక హృదయఫలకము మీద నెన్నటికిని తుడిచివేయబడనట్లు లిఖింపబడు విశ్వాసము కావలెను. మొదట మనకు మన మతవిజ్ఞానము కావలెను. మనకిది యబ్బినతరువాత జీవితమునకు సంబంధించిన ఇంద్రజాలమంతయు కరతలామలకము కాగలదు. యువకులప్పుడు పెద్దలై జీవితపోరాటమునకు తగిన సిద్ధహస్తులు కాగలరు. నేడేమి జరుగుచున్నది? విద్యార్థులే ఎక్కువగా రాజకీయములలో ప్రవేశించుచున్నారు. వారు చదువుకాగానే రేణికిరాని నౌకరీల కెగబడుచు భగవంతుని జ్ఞాన మింసుమంతయు లేక పరిశుద్ధవాయువు, స్ఫాటిక జ్యోతి నిజవీర్యమును ప్రసాదించు స్వాతంత్ర్యము నెరుగని వారై యధోగతికి పోవుచున్నారు.

## భారతసంస్థలు

భారతములోపుట్టిన సంస్థలు, గ్రామపంచాయితీలు వాటియందు నాకు గౌరవముకలదు. భారతదేశము నిజమైన ప్రజాస్వామిక దేశము. కనుకనే యది యింతవరకు జరిగిన ప్రతిదాడి నెదుర్కొనగల్గినది. రాజులు, రాజాధిరాజులు,

స్వదేశీయులుగాని విదేశీయులుగాని, రాబడిని వసూలుచేసు కొనుటతప్ప ప్రజాసామాన్యమును చలింపచేయలేకపోయిరి; స్పృశింపలేకపోయిరి. ప్రజలు రాజుభాగమును రాజుకిచ్చి తమమట్టుకు తాము తమఇచ్ఛవచ్చినట్లే జీవించుచుండిరి. వర్ణమను విస్తృతసంస్థ మతవిషయములనే కాక రాజకీయ యాశయములను కూడ నీడేర్చుచుండెను. గ్రామ ప్రజలు తమ యంతరంగ వ్యవహారములను వర్ణపద్ధతి ద్వారానే పరిష్కరించుకొనుచుండిరి. ప్రభుత్వదౌర్జన్యమునుకూడ వారు దాని చేతనే ఎదుర్కొనెడివారు. వర్ణపద్ధతిని కనిపెట్టిన జాతికి గల యద్భుతవ్యవస్థాపక శక్తిని కాదనుట సాధ్యముకాదు. పదిలక్షలమంది కెట్టి గొప్పప్రయత్నము లేకుండగనే హరిద్వారమువద్ద కుంభమేళ పర్వదినములలో జరుపబడు సమస్త సదుపాయములను చూచినచో ఆ సంస్థయొక్క పటుత్వము విశదముకాగలదు. మనలో సమీకరణ శక్తి లేదనుమాట నేడు పరిపాటియైనది. ఈ విషయము క్రొత్త సాంప్రదాయములలో తయారైన వారిపట్ల కొంతవరకు నిజమే. స్వదేశీతత్త్వము పూర్తిగా విస్మరింపబడుటచే మనకు తీరనినష్టము వాటిల్లినది.

విద్యార్థికులమైన మనము విదేశ భాషలలో విద్యనభ్యసించితిమి. కనుక మనము ప్రజలకు దూరమైతిమి. ప్రజలకు మనము ప్రతినిధులము కాగోరుదుము. కాని మనిమిందులో

విఫలులమైతిమి. ఆంగ్లాధికారులెంతో మనము కూడ ప్రజల దృష్టిలో నంతటివారమే. వారి హృదయము లీయుభయు లకును తెలియవు. వారి యాశయములు మనవి కావు. కనుక అంతరమేర్పడినది. ప్రజలకు వారి ప్రాతినిధ్యము వహించువారికి మధ్య సంబంధము తెగిపోయినది. గత ఏబది వత్సరములనుండి మనము దేశభాషలలో చదువుకొని యుండినచో మన పెద్దలు, నౌకరులు, ఇరుగుపొరుగు మన జ్ఞానమును పంచుకొనెడివారు. జె. సి. బోస్, పి. సి. రే వంటి శాస్త్రవేత్తలు కనిపెట్టిన యద్భుత విషయములు ప్రజలకు రామాయణ, భారతములవలె గృహపెన్నిధు లయ్యెడివి. గ్రామ పారిశుద్ధ్యము చాల కాలము క్రితమే సాధింపబడెడిది. గ్రామ పంచాయతీ లీసరికి జీవముతో నుట్టి పడుచుండెడివి. భారతదేశము తన యవసరములకు తగిన స్వపరిపాలనము ననుభవించుచు తన పవిత్ర భూమిమీద జరుపబడుచు వచ్చిన యవమానకరములగు హానన కాండ ననుభవింపకుండెడిది.

మన యార్థిక జీవితములో స్వదేశీ వ్రతము లోపించుట చేతనే భారతదేశము గర్భదారిద్ర్యము ననుభవించు చున్నది. బయటనుండి భారతదేశమున కొక్క వస్త్రమైనను రాక యుండినచో నేడది పాలమీగడలతో తులతూగు చుండెడిది, కాని యిది యట్లు జరుగలేదు.

ఆర్థిక స్వదేశీ వ్రతము పగదీర్చుకొనుటకు ప్రయోగింప బడిన బహిష్కరణోద్యమము కాదు. అది యందరు ననుస రింప దగిన మత సూత్రముగనే పరిగణింపబడవలెను. నేను ఆర్థికవేత్తను కాను. కాని తనకు కావలసిన సమస్తమును యింగ్లండు తయారుచేసికొని స్వయం సమృద్ధితో నుండగల దని వ్రాయబడిన కొన్ని గ్రంథములను నేను చూచితిని

తన కొరకు జీవింపకుండ భారతదేశము లాంకషైర్ కొరకు గాని మరే దేశము కొరకుగాని జీవింపచాలదు. తనకు కావలసిన వాటినన్నింటిని తన సరిహద్దులలో పండిం చిననాడే యది తన కొరకు జీవింపగలదు. భ్రాతృహత్య, యసూయ మొదలగు ననేక దుర్మార్గములకు కారణము, విధ్వంసకరమునగు పిచ్చి పోటీకది దిగనక్కర లేదు.

భారత దేశములో చేనేత మగ్గము మృత్యుదశలో నున్నది. గతవత్సరము నా పర్యటనలో నేను ప్రత్యే కము యీ వృత్తిని గురించి పరిశోధింపగా నెన్ని వేలకుటుం బము లెంత దెబ్బతినినది నాకు ద్యోతకమైనా హృదయము విలపించినది. గౌరవము గలదై యుచ్ఛదశలో నున్న యీ వృత్తినుండి యెందరెందరో 'కాందిశీకు' లైరి. మనము స్వదేశీని స్వీకరించినపుడు ప్రజలకు కావలసిన వాటిని మన మందింపవలెను. అపుడు ప్రతి గ్రామము స్వయంసమృద్ధిగా నుండి తోడి గ్రామములకు కావలసిన వాటినందించుచు

పుష్టి, తుష్టి కలిగియుండును. ఇది యంతయు నర్థరహితముగ కన్పించవచ్చును. అవును, భారతదేశము అర్థరహితమైన దేశము. నోరెండి పోవుచుండ నొక కరుణాళువగు మహమ్మదీయుడు స్వాదు జలముల నిచ్చుచో త్రాగకుండుట యర్థరహితమే. కాని వేలకొలది హిందువులు చావనైనను చత్తురు కాని మహమ్మదీయులు గృహములలో నీరు త్రాగరు. భారతదేశములో తయారైన అన్న వస్త్రములనే కాని వాడరాదని తమ మతము శాసించుచున్నదని యీ యర్థరహితమైన ప్రజలకే విశ్వాసము జనించెనేని వారు విదేశ వస్తువులను ముట్టనే ముట్టరు. జీవితరంగములోనే శాఖలోను శాసనముల జోక్యమును నేను సహింపను. అది యెంత మంచిదైనను కనీస చెడుగేయగును. కానీ విదేశ వస్తువులమీద నిక్కచ్చియైన రక్షణసుంక ముండవచ్చును.

బ్రిటిషు వలసయైన మారిషసు నుంచి వచ్చిన పంచదారమీద పన్ను వేసి నేటాలు (ఇదియు బ్రిటిషు వలసయే) తన్ను రక్షించుకొనెను. స్వేచ్ఛా వాణిజ్య మను పేరుతో ఇంగ్లండు భారతదేశమున కపచారము చేసెను. అది యింగ్లండు కాహారమే కాని మన దేశమునకు విష మయ్యెను.

స్వదేశీవ్రతము నాగరికత కాదని, యది కేవలము స్వార్థ సిద్ధాంతమని, యది వెనుకకు పోవుటయని వాదించువారు

కలదు. ఈ సూత్రమునంత యెక్కువగా తరచదలచుకొన లేదు గాని మానవప్రేమ, గర్వరహితదృష్టితో చూచి నపుడు స్వదేశీ యొక్కటే సందర్భశుద్ధిగల సిద్ధాంతము. నా కుటుంబమునే నేను సేవింపలేనపుడు భారత దేశము నంతను నుద్ధరింతుననుట దురభిమానము. కుటుంబరక్షణము చేసి కొనుచు తద్వారా జాతినంతను మానవ లోకమునంతను సేవించుచున్నాననుకొనుట యుత్తమము. ప్రేమ, మానవ త్వము యిందులో నున్నవి. ఒకపనిలోనున్న గుణము దాని యుద్దేశ్యమునుబట్టియే నిర్ణయమగును. నాకుటుంబముకొరకు నేను ప్రజలను కొట్టుకొని తినుచు ధనవంతుడనై నా కుటుంబమువారి కారాసించు యక్రమకోర్కెల నన్నిటిని తీర్చు చుండవచ్చును. నిజమున కిది నా కుటుంబమునకుగాని ప్రభు త్వమునకు గాని సేవకాదు. ఇట్లు చేయక భగవంతుడు నాకవయవములను ప్రసాదించినది నన్ను నామీద యాధా రపడినవారిని పోషించుటకు మాత్రమే యని గుర్తించినచో నాజీవితమా తేలికయగును. నా సంబంధీకులును బాగు పడుదురు. ఇతరుల కపకారము చేయకుండ నేను నాకుటుంబ మును పోషించు కొనినవాడనగుదును. అందరు యిట్టి జీవి తమునే జీవింతురనుకొందము. అపుడు మన కాదర్శప్రాయ మగుప్రభుత్వమే ప్రాప్తించును. ఒక్కమాటుగానే ప్రజలం

దరు యిట్టిస్థితికి రాజాలరు. కాని యిట్టి ఋజుమార్గము నవలంబించిన వారట్టి శుభదినములను దగ్గరకు తెచ్చినవారు కాగలరు. ఇట్టిజీవితప్రణాళికవలన, యితరదేశములను విడిచి యొక్క భారతమునే సేవించుటవలన, నే నేదేశమునకు నపకారము చేయుటలేదు. నా దేశభక్తి నాదేశమును ప్రపంచమునుకూడ ఆకళింపు చేసికొనగలదు. నాజన్మ భూమిని మొదట నేను చూచుకొందును. అట్లు చేయుటలో నేను యితరదేశములతో పోటీ పెట్టుకొనను. కనుక నిది యుభయతారకమైనది. ఇతరుల యాస్తి కపకారము చేయకుండ నీయాస్తి వినియోగించుకొనుము. అనుసూక్తి కేవలము చట్టసంబంధమైన సూత్రమే కాక జీవితమునకు సంబంధించిన యుదారసూత్రము. ప్రేమ, అహింసలను పాటించు తాళము చెవి.

## వర్ణాశ్రమము

ఒక విజాతీయుడు తనకూతురును మహాత్ముని కుమారునకు యథావిధిగ వివాహము చేయుట కభ్యంతరమేమి కలదని ప్రశ్నింపగా నతడిట్లుచెప్పెను. "నే నట్టిదానికెన్నడు నంగీకరింపను. అది మనము జన్మించిన సరిహద్దుల నతిక్రమించుట కనుక నా మతభావములకు సరిపడదు. వర్ణము దాటి వివాహము చేసుకొనుటకు నే నంగీకరింపను. కాని హిందూదేశ

ములో కృత్రిమముగా బయలుదేరిన వివిధకులములలో నాకు నమ్మకము లేదు. నేటి కులములకు నంటరానితనమునకు నిజమైన వర్ణాశయములతో సంబంధము లేదు.'' వర్ణాశ్రమ ధర్మమనగా నీభావమేమియని మరల ప్రశ్నింపగా నతడిట్లు బదులు చెప్పెను.

''ఈ శిక్షణక్రింద పెరుగని మీకు దీనినిగురించి బోధించుటంత తేలికవిషయముకాదు. నాలుగువర్ణములను విశ్వసించు నావంటివానికి మానవజీవిత మీభూమిమీద నొక మజిలీస్థానము. ఈ జీవితాంతమున యనుభవింపవలసిన యనుభవములెన్నియో కలవు. మన ప్రస్తుత జీవితమీ ప్రత్యేకస్థితికి సంబంధించిన కొన్ని సూత్రములతో గడపవలసిన యొక శిక్షణలేక ఆశ్రమము. మనమిప్పుడు మన తల్లిదండ్రులను, మన జన్మభూమిని మన పితృపితామహులను మార్చుకొనగలమా? కనుక మనము పుట్టినపుడే భగవంతుడు మనకు కల్పించిన సాంప్రదాయముల నన్నింటిని యీ ప్రస్తుత అల్పజీవిత కాలములో భంగపరచుటకు వ్యక్తిగతముగ మనమేల కోరవలెను? స్వధర్మమును వీడి పరధర్మమును వహించుట మంచిదికాదని గీత చక్కగ నుపదేశించెను. అనువదించుటకువీలులేని 'ధర్మ' పదముచే చెప్పబడిన యీమతధర్మములో భగవంతుడు మన పుట్టుకలో నేర్పరచిన వాతావరణముకూడ కలదని నాభావము. మనము పుట్టిన పరిస్థితుల

కనుగుణముగ మనము జీవింపవలెను. కాని వ్యక్తిగత కారణములచేతగాని, స్వార్థచింతచేతగాని మనము వాటిపై తిరుగుబాటు చేయరాదు.

## హిందూ ముస్లిము ఐక్యత

ఇదియే మీ ధ్యేయము. దీనిని గురించి మీరు విసుగు లేకుండ చెప్పుచుందురు. దీనికొరకు హిందువులు, ముస్లిములు కలిసి వివాహము చేసికొనవలెనా? భోజన ప్రతిభోజనములు జరుపుకొనవలెనా! అని యతనిని ప్రశ్నింపగా గాంధీజీ యిట్లు విస్పష్టముగ చెప్పెను.

" వర్ణము ఉపద్రవకరమైన సంస్థయని నేను భావింపను. అది ప్రారంభమైనపు డతిపవిత్రముగ నుండి జాతీయాభివృద్ధిని చేకూర్చుచుండెను జాతీయవికాసమునకు భోజనప్రతిభోజనములు, అంతర్వివాహములు అవసరమను భావము పాశ్చాత్యులవద్దనుండి యెరువు తెచ్చుకొనిన ఛాందసభావము. భుజించుట జీవితావసరమైన యితర పారిశుధ్య కర్మలవలె పవిత్రప్రాణదాయకమైనది. మానవలోకము, తనకే యుపకారమగునట్లు, భోజనము నొకతంతుక్రింద భోగకలాపము క్రింద మార్చివేయకుండినచో, మన మితర జీవితావసరముల నెట్లు గోప్యముగ జరుపుకొందుమో యట్లే దీనిని జరుపుకొనవలెను. హిందూమతములోని యుత్తమోత్తమసంస్కారము

దీని నీభావముతోనే గ్రహించెను. హిందువులలో వేలకొలది సంస్కారు లిప్పటికిని యితరులు చూచుచుండగ తినని వారు కలరు. అట్టి స్త్రీ పురుషు లనేకమంది పేరులను నేను చెప్పగలను. అయినను వారెవరియెడల నెట్టి ద్వేషభావమును చూపి యెరుగక నందరితో నతిమైత్రితోనే జీవించుచుందురు. అంతర్వివాహ మింతకంటే కఠినమైనది. సోదరులు సోదరీలు వివాహము చేసికొనవలెనను భావములు లేక నెంతమైత్రితో మెలంగుచుందురో యట్లే నాకూతురు ప్రతి మహమ్మదీయుని సోదరునివలె చూచును ప్రతిమహమ్మదీయుడు నదేభావముతోను నేలజీవింపలేరో నాకర్థముకాదు. మతమును గురించి వివాహముగురించి నాకతి నిశితభావములు కలవు. ఈ రెండు విషయములలోను మన కోరికలను మనమెంత తగ్గించుకొనిన మతరీత్యా యంత మంచిదని నేను భావింతును. నేను ప్రతి వానితోను తినవలెనని గాని, నాకూతురు నెవడుపడితే వాడు వివాహము చేసికొనవచ్చునని గాని సమర్థించు ప్రపంచముతో నాకెన్నటికిని పొత్తుకుదరదు.

'నేను వసుధైవ కుటుంబకము'గా జీవించుచున్నాను. నాకొక్క ముస్లిముతోగాని క్రైస్తవునితోగాని యెన్నడును జగడమురాలేదు. నేనువారి గృహములలో ఫలములు తప్ప మరేమియు తీసుకొనలేదు, కాని యీ నియమము వలన మాయత్యంత సన్నిహితత్వ మెన్నటికిని చెడిపోలేదు.

యదార్థమే మనమైత్రికి, ఐకమత్యమునకు అంతర్భోజనములు, అంతర్వివాహములు ముఖ్యాతిముఖ్య విషయములు కావు. అవి దానికి చిహ్నములని మాత్రము చెప్పవచ్చును. భోజనములు, వివాహములు జరుపుకొనవలెనని నిర్బంధించుట మైత్రికి ప్రతిబంధకమగును, కాని ప్రయోజనకరము కాజాలదు. అట్టివి జరిగినకాని వారేకము కాజాలరనుట వలన మనమొక కృత్రిమ గోడను నిర్మించుకొనినవారమగుదుము —అట్టిదానిని తొలగించుట యసంభవమగును.

హిందువులు మహమ్మదీయులు వివాహములు చేసికొనుచు తమతమ మతములను నిలుపుకొనుట యసాధ్యమని నేను చెప్పగలను. హిందూ మహమ్మదీయ సఖ్యతలోగల శోభ యేమనగా వారెవరి మతమును వారు చక్కగా పాటించుకొనుచు నుభయులు నొకరినొకరు గౌరవించుకొనవలెను. ఉభయ తెగలలోని శ్రోత్రియులు కూడ తామింతవరకు భావించుచున్న సహజ శతృవులమను భావమును తుడిచివేయవలెను. అన్నిజాతులకు నన్ని కులములకు పరస్పరసహనము ముఖ్యాతిముఖ్యము. మహమ్మదీయులు భగవంతుని గురించి చేయు పూజావిధానములను. ఆచార వ్యవహారములను హిందువులు సహించినగాని వారు శాంతితో జీవింపజాలరు. అట్లే మహమ్మదీయులును హిందూ విగ్రహారాధనను. గోపూజను సహింపవలెను. సహన

మనగా నేను కూడ నట్లు చేయవలెనను భావము కాదు. మద్యపానము, మాంసాహారము, పొగ త్రాగుట నా కెంత మాత్రము యిష్టము కావు. కాని హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు యనేకులు చేసినను నేను సహనమునే వహింతును. అట్లే వారును నా నియమవ్రతము పట్ల సహనము వహింపగోరుదును. మనతగాదా లన్నియు మన యభిప్రాయముల ప్రకారమే యితరులును చేయవలెనని నిర్బంధించుటచేతనే కలుగుచున్నవి." రక్షణశక్తిని కల్పించు శోత్రియత్వము. ఉదార్తమైన విశిష్టతగల యాధ్యాత్మిక స్వేచ్ఛ ఈ రెండింటి సమ్మేళనము వలన మహాత్మునకు భారత ప్రజలలో నమేయబలము చేకూరినది. సుపరిచితమైన హిందూమతగ్రంథముల ద్వారా, హిందీలో ప్రజల కతిసులభ శైలిలో భారతేతిహాస కాథాంశములను వినిపించుటద్వారా, ఉపవాసవ్రతములు, హారతాళములు, శపధములు, త్యాగములు, జయిలు తపస్సులు- లక్షలకొలది గ్రామప్రజల నాకర్షించెను. ప్రజలు నేలయీనినట్లు తండోపతండములుగ వచ్చి యతని యుపన్యాసములను వినుచుండెడివారు. ఒక చంద్ర గ్రహణమునాటిరాత్రి లక్షమంది స్త్రీపురుషు లనేక గ్రామములనుండివచ్చి యొకనదీతీరమున చేరుకొని యతనియమృత వాక్కులను జుట్టుకొనిరి. గ్రహణసమయమున వారొకమత విధిని జరుపుకొనుటకు వచ్చినను, చీమ చిటుక్కుమనకుండ

నతనివాక్కులకొరకే కాచుకొని యుండిరి. అతనిని దర్శించు కొనుటే మహా పవిత్రకార్యమని వారు భావించెడువారు. ప్రజల నతడెంత సులభముగ గ్రహింపగలిగెనో వారును నతని నంత చక్కగ గ్రహించి యతడు చెప్పిన చొప్పున నడిచెడివారు. కనుక వత్సరములకొలది విదేశములలో నివసించుచు పూర్తిగా పాశ్చాత్యాచారవ్యవహారములనే యలవరచుకొన్న వారివలె గాక మహాత్ముని వేళ్లు భారత క్షేత్రముననే నాటుకొని యుండెను. అతని మనస్సు మాత్రము విశాలమగుచు యావత్ప్రపంచమును విస్తరించెను. కాని యతని జీవిత కేంద్రము హిందూ మతమందే సుస్థాపితమయ్యెను. అతడు దానినే ప్రేమించెను

## ఖద్దరు

వడుకునూలు యుద్యమమును గురించి తెలిసికొనుటకు పూర్వమది దేనిని చేయుట కుద్దేశించుటలేదో తెలిసికొనుట యుక్తము. ఉదాహరణమున కది యిప్పుడున్న యేపరిశ్రమతోను పోటీచేసి దానిని లేకుండ చేయుగోరుటలేదు, శక్తివంతుడై యితరత్ర యెక్కువ సంపాదింపగల యేవ్యక్తినిని తనపనిని విడిచిపెట్టవలసినదని యదికోరుటలేదు, కనుక దాని వలనకలుగు లబ్ధినిగురించి యితర వృత్తులతో పోల్చుటకాని యది పంచిపెట్టు పంపకములను, వాటాలనుగురించి కాని

తర్కించుట విషయాంతరమగును. ఒక్క మాటలో ధనవంతుడు కావలెనను నర్థసిద్ధికిచ్చుట తావులేదు. భారతదేశములో సంవత్సరమున కారునెలల పాటు అధికసంఖ్యాకులైన ప్రజలు యేపనిలేకుండ బలవంతముగ సోమరులగుచున్నారు. వ్యవసాయ వృత్తితోపాటు ప్రజలకు పనిచెప్పు మరియొకపని లేక వారు పచ్చియుపవాసములు చేయుచున్నారు. ఈరెండు విషయములు లేనిచో, నది యిచ్చు ఫలిత మతిస్వల్పము కనుక, భారతజాతీయ జీవనములో రాటమునకు స్థానమే లేదు. భారత ప్రజలు కటిక దారిద్ర్యము ననుభవించుచుండుట, దీనికిగల కారణములు, యీకారణములను తొలగించుట యను విషయమును పరికించి నపుడు రాటము యొక్క యార్థిక ప్రయోజనము తెలియగలదు. భారతదేశములోని ముఖ్య జాతీయపరిశ్రమలన్నియు క్రమముగా నశించి వాటి స్థానములో మరేదియు రాక పోవుట. దేశము నానాటికి గ్రామముల మీదనే యాధారపడవలసి వచ్చుట, పశువంగడము క్షీణించి పోవుచుండుట, కరవు కాటకములు తరచు సంభవించుచుండుట, వ్యవసాయదారు దినదినము దివాలా తీయుచుండుట, తునక తునకలై పోయిన తనకున్న కొద్ది పాటి భూమిని యభివృద్ధిలోనికి తెచ్చుకొనుట కతనికి సావకాశము లేకపోవుట, నవీనయంత్రములను పరికరములను. క్రొత్త

వ్యవసాయ పద్ధతులను నుపయోగించుటకీ ముక్కలు పనికి రాకపోవుట, వడ్డీ వ్యాపారస్థులు వ్యవసాయదారులను పీడించుటచే నతడు ప్రత్తిమీద కేంద్రీకరించుట, ఆహారపదార్థముల ధరవరలు హెచ్చిపోవుచుండుట, ఇట్టివే మరి యనేక కారణములు కలిసి దేశమునకు నేడు దారిద్ర్యము నిరుద్యోగము తెచ్చిపెట్టినవి,

పందొమ్మిదవ శతాబ్ద మొదటి పాదములో డాక్టరు బువనన్, మాంటుగామరీ మార్టినులు ఉత్తర హిందూ దేశములో తయారుచేసిన యంచనా లెక్కలు పల్లెటూళ్లు, పట్టణములు కూడ ధనధాన్యములతో తులతూగుచున్నట్లు, ప్రతిగ్రామములోను, పట్టణములోను ప్రజలే యైచ్ఛికముగ సంస్థల నేర్పరచుకొనినట్లు, లక్షలకొలది వడుకువారిని, వేలకొలది నేయువారిని, రంగులు, అద్దకములు, ముచ్చి, వడ్రంగము, చలవపని, కమ్మరము, కుమ్మరము, తాపీపని, యిట్టివే యనేక చిన్న చిన్న పనులు జిల్లా జిల్లాలోను సంవత్సరము పొడుగున పనికలిగి దోసిళ్లతో లక్షలకొలది ధనము సంపాదించి, బెంగాలు, బీహారు, మైసూరు, ఉత్తరప్రదేశము లన్నింటిలోను యెవరివంతు వారికి సమముగా పంచిపెట్టుచుండెడివారని కంఠోక్తిగా నిరూపించినారు, నేటిపరిస్థితులను అప్పటి పరిస్థితులతో పోల్చి చూడవలెనన్న నేటి జనాభా లెక్కలద్వారా యది విదితము కాగలదు, పెద్ద

రాష్ట్రములలో నేను దామాషాప్రకారము, కమతమునకు మూడుయెకరములు, బొంబాయి, పంజాబు, పశ్చిమోత్తర సరిహద్దులలో పదిన్నర యెకరములు. ఇట్టి దరిద్రకమతముల మీద నూటికిడెబ్బదియిద్దరుమంది యాధారపడి బ్రతుకవలెను. జనాభా లెక్కలలో దీనివలన ప్రజలకు పూర్తిగా పనిలేదు. భూసారమును వినియోగించుటకు వీలులేదు, అని వ్రాయబడెను. బెంగాలు జనాభా లెక్కలలో థామ్సను యిట్లు వ్రాసెను. "బ్రిటిషు బెంగాలులో వ్యవసాయ రంగములో నిక్కచ్చిగా పనిచేయువారు 11060, 629 మంది. అనగా పనిచేయువానికి 2.2 యకరములు వ్యవసాయదారు దారిద్ర్యమును తెలుపుటకీ లెక్కలు చాలును. ఇంతచిన్న కమతము మీద పని కొద్దిరోజులు మాత్రమే యుండును. వ్యవసాయదారు దున్నునపుడు, సస్యము చల్లునపుడు. కోతలు కోయునపుడు మాత్రమే కష్టపడి పనిచేయును. సంవత్సరము పొడుగున నతనికిక పనియే యుండదు."

ఉత్తరప్రదేశ జనాభాలెక్కకట్టిన ఐడ్ కొలది ఋతువులలో మాత్రమే వ్యవసాయదారుకు గట్టి పనియుండును. తక్కిన కాలము సంవత్సరము పొడుగున సోమరితనము. మధ్యప్రదేశమునుగురించి హార్టనుకూడ 'వర్ష కాలము గడచిన తరువాత వచ్చు కరీపుపంటయొక్కటే ముఖ్యమైన పంట. ఇదినూర్పులైనతరువాత తిరిగి ఋతువు వచ్చువరకు పనియుండదు' అని

వ్రాసిరి. పంజాబునుగుంచి కాల్వర్టు నూటయేబది రోజులు మాత్రమే సంవత్సరములో పనియుండునని చెప్పెను. పెద్ద కమతములు (9-18 యకరములు) గల పంజాబులోనే సాగు లోనికి తీసుకొని రాబడిన భూమి యెక్కువ శాతముగనున్న చోట (మెట్టభూములలో కంటె యెక్కువ పనియుండును) యిట్లుండ యితర రాష్ట్రముల సంగతి యూహింపవచ్చును.

ఆరుమాసములు రైతుకు పనియుండదని యీ యధికారు లందరు నేకగ్రీవముగ తెలిపిరి. ఇదియే రైతుయొక్క దారిద్ర్యమునకు కారణమని వారిలో నొకరిద్దరు గ్రుచ్చి వ్రాసిరి. కమతమునకు దాదాపు 21 యకరములు గల లాంకషైరులోనే "సీతాకాలములోను చెడు వాతావరణ దినములలోను వ్యవసాయదారులకు తమయిండ్లలోనే పూర్వ కాలములోవలె నేదోయొక లాభదాయకమైన పనియుండు టావరమే యగుటయు: ప్రధానమైన వస్త్రపరిశ్రమగల యిటలీలో "మల్బరీచెట్లు ప్రతిజిల్లాలోను పెరుగుచోట రైతు స్త్రీలువమకు నూలుతో చేతినిండ పని కలిగియుండ" భారతదేశమువంటి వ్యవసాయ దేశములో రైతు కింకొక యుపవృత్తి యుండవలెననుటకు వాదమెందులకో యర్థము కాదు.

కాని యీ యుపవృత్తి యేదియను చర్చ రాటముతోనే ప్రారంభమైనదను విషయమును విమర్శకులు మరువరాదు.

ఇది గుర్తింపబడినచో ఫోర్డు మోటారుకారువలె రాటము సరికొత్తగా కనుగొనబడినది కాదని మనవిచేయగోరుదును. తప్పిపోయిన బిడ్డ తనతల్లిని కనుగొనినట్టిది తిరిగి కనుగొనుట వంటిది. ఈ బిడ్డ 1900 మైళ్లు పొడవు 1500 మైళ్లు వైశాల్యముగలిగిన దేశమంతట వెదజల్లబడియున్న ప్రపంచములో నత్యంత చలనములేక బీదప్రజానీకమను సంగతి విమర్శకులు మరువరాదు, రాటమే వీరికి పూర్వము నుండియు పుష్టిని ప్రసాదించిన తల్లి.

ఈవిషయమును గుర్తించినచో నితర పరిశ్రమలనుగురించి యెవరును నంత గోలచేయరని నేననుకొందును. పరిశ్రమలనేకములు కొల్లలుగగలవు. పాడిపరిశ్రమ నేల ప్రయత్నింపరాదు? భారత దేశము డెన్మార్కు దేశముకాదు. ఇంగ్లండుకు కావలసిన 40 శాతము వెన్నవర్తకము డెన్మార్కునుండియే జరుగుచున్నది. 1900 సంవత్సరములో యింగ్లండుకు డెన్మార్కునుండి 80 లక్షలపౌనుల విలువగల వెన్న 30 లక్షల విలువగల మాంసము యెగుమతియైనది. పందుల పెంపకము పాడిపరిశ్రమకు ముఖ్యమైన యుపపరిశ్రమ. కాని భారత దేశముయొక్క పాడిసంపదను భరింపగల మరియొక పెద్ద భారత దేశము మనకెచ్చట లభ్యమగును? భారతదేశములోని హిందువులను మహమ్మదీయులను తోళ్లను బాగు చేయువలెనని యెవరుకోరుదురు? పశువులపెంపకము, తేనెటీ

గల పెంపకమును కూడ మనమిట్లే పరిగణింపవచ్చును. పైగా నవి క్రొత్తవి. వానికి కొంత శాస్త్రజ్ఞానము కావలెను. భారతదేశము నేడు వ్యవసాయమును వృద్ధిచేసి తనకున్న తలకొక యకరమును పెంచజాలదు. ఏలన భారతదేశము ఐర్లండుకాదు. అచ్చటఅద్భుతమైన వ్యవసాయడిపార్టుమెంటు కలదు. అదియనేకవ్యవసాయ కళాశాలలను నెలకొల్పి గొప్ప గొప్ప నిపుణులను గ్రామసభలకు సరఫరా చేయును. ఇక ప్రజానీకమంతయు మేజోళ్లు అల్లుట, తట్టలల్లుట, బెత్తము పనిచేయజాలరు. నూలువలె నీపనులకు సులభమైన శాశ్వత సంతలు దొరకవు. బెంగాలు, చెన్నపట్టణములవంటి చోట నేటికిని పాతనూలు సంతలుకలవు. నారమిల్లుల నెందుకు పెట్టకూడదని యొకరందురు. నేటివరకు నారమిల్లులు 250,000 మంది కూలీలకు మాత్రమే పనిచెప్పగలిగినవి. అవి నార యుత్పత్తిదారులను దరిద్రులనుచేసి కొద్దిమంది పెట్టుబడిదారులను, దళారులను ధనవంతులను చేసినది. డెబ్బది యేండ్ల పత్తిపరిశ్రమ 50 కోట్లు పెట్టుబడిపెట్టి 15 లక్షల మందికి మాత్రమే పని చెప్పగలిగినది. అనగా 370,000 మిల్లుకూలీలకు కుటుంబములకు కొద్దిమంది గుమాస్తాలకు, పెద్ద ఆఫీసరులకు మాత్రమే పనిచెప్పగలిగినవి.

కాని వడుకుపని యతిస్వల్ప ఆదాయము నిచ్చునది కనుక నార్థికముగ శుద్ధదండుగపనియని యందురు. దానినే ప్రధాన

వృత్తిగా సమర్థించుటలేదను విషయమును మరచిపోవుచున్నారు. పనిలేక కాలమును వ్యర్థపుచ్చువారికే యది సూచింపబడుచున్నది. రోజుకు రెండణాలు లేక యణాకానిండు. సంవత్సరమునకు యిరువది నాలుగు రూపాయలు. ఇదిచిన్నదో పెద్దదో ప్రజాసామాన్యముయొక్క గర్భదారిద్ర్యమును కండ్లారచూచువారు మాత్రమే చెప్పగలరు. భారతదేశములో తలసరి యాదాయమును గురించి తర్కించుటకిది చోటుకాదు. దీనిని భారతదేశ యార్థిక కమిటీపరిశోధక పెద్దలు పదిహేనుమంది వేరువేరు కాలములలో లెక్కలు వేసిరి. దాదాభాయినౌరోజీ యాబంగారు లేడినిగురించి వేటప్రారంభించినది మొదలు యింత వరకెవరును దీనిని పట్టుకొనజాలరైరి. ఫిన్లేషిరాన్ అనునతడు వేసినలెక్క ప్రకారము తలకు 116 రూపాయలే నిజమనుకొనినచో (నిజమునకిది చాల హెచ్చుమొత్తము) యిరువది నాలుగు రూపాయలంత తక్కువ మొత్తమా?

ఇంతకు వడుకునూలును సమర్థించుటకీ క్రింది ప్రత్యేక కారణములు. దరిద్రబాధానివారకములుగా తోచుచున్నది. అది నిమిషముల మీద సాధ్యమగు విషయము ఏలన:-

1. (a) దీనికి పెట్టుబడి యక్కరలేదు. ఖరీదైన పరికరము లవసరములేదు. దీనికి కావలసిన ముడిసామాగ్రి పరికరములు స్థానికముగనే సులభముగ లభ్యమగును.

(b) దారిద్ర్య పీడితులగు ప్రజాసామాన్యమునకు గలబుద్ధి, నేర్పరితనము కంటె యెక్కువేదియు దీనికవసరము లేదు,

(c) దీనికి కావలసిన శరీరపరిశ్రమ యతి స్వల్పముగుటచే ముసలివాళ్లు, చిన్న పిల్లలు కూడ పనిచేసి కుటుంబాదాయమును పెంచవచ్చును.

(d) వడుకు సాంప్రదాయము ప్రజలలో నింకను నశింపలేదు. కనుక దీనిని క్రొత్తగా ప్రవేశ పెట్టుటకు ప్రయత్నమక్కరలేదు.

(e) ఇది శాశ్వతమైనది. ప్రతి వానికి వీలైనది. ఆహారము తరువాత నూలొక్కటే పనివాని యింటి వద్దనే అమ్ముడు పోగలదినుసు. బీదపడి యున్న ఒక్క రైతుకు స్థిరమైన నిత్యపంట.

3. వాతావరణ పరిస్థితు లేవియు దీనిని బాధింపవు. కరువు కాములందును దీనిని చేబట్టవచ్చును-

4. ఇది ప్రజల మత, సాంఘికాచార వ్యవహారములకు వ్యతిరేకము కాదు.

5. క్షామముతో పోరాడుట కిది నిర్దుష్టమైన చక్కని సులభ సాధన,

6. ఇది రైతు కుటీరము వద్దనే పని కల్పించును. కనుక నార్థికవత్తిడి వలన సంభవించు కుటుంబ విచ్ఛేదము కలుగనక్కరలేదు,

7. శిథిలావస్థలలో నున్న గ్రామ సంస్థల కట్టుబాటుల వలన కలుగు ఫలితము నిది యొక్కటే పొందగలము.

8. చేనేత వానికి, వ్యవసాయ దారుకు నిది వెన్నముక చేనేత పరిశ్రమ కిది ప్రాణాధారము. చేనేతవలన కోటి మందికి పని కలుగుచున్నది. దేశమునకు కావలసిన మూడవ వంతు గుడ్డ దీనివలననే తయారగు చున్నది.

9. నాశనమై పోవుచున్న గ్రామములను నుద్ధరించి యచ్చటగల గ్రామసంబంధమైన తక్కిన యనేక వృత్తుల నిది పునరుద్ధరింపగలదు.

10. భారత దేశములో నున్న కోట్లకొలది ప్రజల కెప్పటికైనను యిదొక్కటియే భాగ్యభోగ్యములను న్యాయముగ పంచిపెట్టగలదు.

11. నిరుద్యోగము నిది యొక్కటే మాన్పగలదు. వ్యవసాయకునికి పూర్తి పని కల్పించుటే కాక పనిలేక తిరుగు యువక విద్యావంతులకును నిదియే శరణ్యము కాగలదు. ఇది చాల పెద్దయెత్తుపని కనుక దేశములో నున్న బుద్ధిబలసంపన్నులు దీని మీాద కేంద్రీకరించుట మంచిది.

# మతము - అస్పృశ్యత

'అస్పృశ్యతయే' వర్ణము. వర్ణమనగా నస్పృశ్యతయైనచో వర్ణమెంత శీఘ్రముగ నశించిన నంతమంచియే చేకూరును. కాని వర్ణమతి సౌష్ఠవమైన సంస్థయని నేను తృప్తి చెందితిని. 'నన్ను ముట్టుకొనకుము' అను నేటి గర్విష్ఠికాలపద్ధతి నశించి నట్లే భావింపవలెను. అసంఖ్యాకములుగ నున్న చిల్లరశాఖలన్నియు మన మూహింపనంత త్వరితముగనే మాయము కాగలవు.

ఈదళిత తరగతులవారు గ్రామములబయట, పట్టణముల వెలపల వేరువేరుగ నివశించుచు దుఃఖమయ జీవితములను నడుపుట మన దోషము మనకు సిగ్గుచేటు. మన యసహాయతకు, కార్యశూరులము కాకపోవుటకు బ్రిటిషువాం ఉత్తరవాదులని న్యాయముగనే మనమెట్లు నిరూపించుచున్నామో యట్లే పై తరగతులవారును తమ దోషము నంగీకరింపవలెను. మన పెక్కు భావములను విడచి ప్రేమచే వారితో నైక్యతను పొందుటయే మనయాధ్యాత్మిక రసానుభూతి కత్యురాభ్యాసము కాగలదు.

మనలో ప్రేమశక్తి నశించుటచేతనే నేడు మనము శక్తి హీనులమైతిమి. ఈ మైదు కోట్లమంది మనవారేయను భావ ముత్పన్నమైననాడే మన మొక జాతియను మొదటి

పారమును ప్రదర్శింపగలము. ఈపవిత్ర విధానమొక్కటే హిందూ ముస్లిముల సమస్యనుకూడ తీర్చగలదు. ఏలన, నందు లోకూడ బుద్ధిపూర్వకముగనో యబుద్ధిపూర్వకముగనో 'యస్పృశ్యత 'యను విషబీజములు కలవు. ఇట్టి కృత్రిమయవరోధ ములచే రక్షింపబడవలసిన హిందూమతము త్రొల్లి పతితమని చెప్పక తప్పదు.

"ఈయస్పృశ్యత మద్రాసురాష్ట్రములో నున్నంత క్రూర ముగ మరెచ్చటను లేదు. అస్పృశ్యుని నీడయే బ్రాహ్మణుని మైలపరచును; అతడు బ్రాహ్మణ వీధులలో నడువరాదు. బ్రాహ్మణేతరులును వీరినింతకంటె నెక్కువగ చూచుటలేదు. ఈయిద్దరిమధ్య పంచములు పాదములు పాదముల క్రింద నలిపి వేయబడుచున్నారు. అయినను మద్రాసు భక్తితత్పరతకు, అద్భుత దేవాలయములకు ప్రసిద్ధికెక్కిన రాష్ట్రము. నుదుట యూర్ధ్వపుండ్రములు, సుదీర్ఘ కేశసంపద, విశుద్ధ(వస్త్రరహిత) శరీర కాంతిగల కొందరు ఋషులవలెనే కాన్పింతురు, కాని చిత్రమేమన వారి మత మీబాహ్యరూపములతోనే యంత రించుచున్నట్లు తోచును. మనతోడివారినే యగ్రవర్ణముల వారీ దక్షిణ ప్రాంతములోని క్రూరముగ చూచుచున్నను నాకు వారియందు నమ్మకము పోలేదు. అకోలలో జరిగిన సమావేశమైన సభలో మనమీయస్పృశ్యతను పోగొట్టుకొనినగాని మనకు స్వరాజ్యము రాదని నేనుఘంటాపథముగ చెప్పితిని. యూనప్రప్ప

పంచములో మనమీనాడు సాంఘికముగ కుష్ఠువారివలె చూడబడుటకు మనజాతిలోని యెవనవంతు ప్రజలను మనమట్లు చూచుటయే కారణమని నేనుచెప్పితిని అకహాయోద్యమము యింగ్లీషువారిలోనే కాక మనలోకూడ హృదయ పరివర్తనము జరుగవలెననియే కోరుచున్నది. ఈపరివర్తనము మొదట మనలోనే కలుగవలెను. తరువాత నిది యింగ్లీషువారినికూడ మార్చును. తరతరములనుండి వచ్చుచున్న మచ్చనొక్కవత్సరములో తొలంచు జాతి మన పాతబట్టలను మనము తీసివేయునట్లు త్రాగుడు అలవాటును తొలగించుకొను జాతి తన ప్రాచీనపరిశ్రమకు తరలి వృర్థమగుచున్న కాలము నరువది కోట్ల రూపాయల విలువగల వస్త్రము తయారుచేయు జాతిగ మారినపుడు ప్రపంచమే దద్దరిల్లును. ఈపని జరిగినచో (ఇట్లు జరుగుననియే నే నాశించుచున్నాను) వెక్కిరించిన వారికిది గుణపాఠము భగవత్ప్రసాదము కాగలదు. నేను చెప్పినవిధమున భారతదేశము మారినచో ప్రపంచములో నేజాతియు భారతదేశ స్వరాజ్యము నడ్డగింపజాలదు. భారతాకాశము నలముకొన్న కారుమబ్బులెన్ని యున్నను భారత దేశము అస్పృశ్యతను తొలగించి, విదేశవస్త్రబహిష్కారమున కేముహూర్తమున కంకణముకట్టుకొనునో యాముహూర్తమందే గడ్డకట్టుకొనిపోయిన హృదయములుగల యాంగ్లాధికారులు (స్వాతంత్రము ననుభవించు ధైర్యవంతులు కనుక) భారత దేశము

నకు జోహారులర్పింతురని నేను జోస్యము చెప్పగలను. ఈపరివర్తనము పెద్ద పెద్ద అంచనాలతో గూడినయంత్ర కర్మతంత్రములవలన లభించునది కాదు. "దైవబలము మనకున్నచో నిది యీడేరితీరును. మనయందరి హృదయములలోను భగవాను, డద్భుతమైన మార్పు తెచ్చుచున్న సంగతి నెవరు కాదనగలరు?"

# వైకం సత్యాగ్రహము - విజయభేరి

వైకం తిరువాన్కూరు జిల్లాలో నొక చిన్న కుగ్రామము ఈగ్రామమధ్యభాగమున నొక పెద్ద దేవాలయము కలదు. గ్రామముగుండ పోవు ప్రధాన రాజవీథి యీ దేవాలయమునకిరువైపులనుండి పోవును. దేవాలయమే యీమార్గమును చీల్చుచున్నది గ్రామములోని అస్పృశ్యులందరు యీపల్లపు ప్రాంతములలోనే కాపురముందురు, కాని బ్రాహ్మణుల యిండ్లు యీ దేవాలయ సమీపముననే కలవు కనుకనే వేల కొలదిసంవత్సరములనుండి యస్పృశ్యులను ఈబ్రాహ్మణవీధి గుండ నడువనియ్యక చాలదూరము చుట్టుతిరిగి వచ్చుట సంభవించుచుండెను. గాంధీజీ శిష్యుడైన బారిష్టరుజార్జిజాసఫ్ యీ యమానుష నిషేధమును ధిక్కరించుటకు మొట్ట మొదట పూనుకొని మరియొకనితో యీవీధిగుండ బయలు దేరగా బ్రాహ్మణు లీవీధి మైలపరచినందులకు వీరిని చావ

గొట్టిరి. అప్పుడు పోలీసులడ్డము వచ్చిరి. జార్జిజోసెఫ్ మరియొకసారి నింకొకని తీసుకొని సాత్త్విక నిరోధము చేయగా సంస్థాన పోలీసు లతనిని అరెస్టుచేసిరి.

వెంటనే హరిజనులందరు సాత్త్వికనిరోధముచేసి సంస్థాన జయిళ్లను నింపివేసిరి. జయిళ్లునిండిపోవుటతోడనే యీపోరాటములో మరియొక మజిలీ ప్రారంభమయ్యెను. రోడ్డుపొడుగున పోలీసువారొక దండకట్టుకట్టిసవర్ణులను మాత్రమే యారోడ్డుమీద పోనిచ్చుచు "అస్పృశ్యుల" నాపివేయుచుండిరి. తరువాత వారముల తరబడి పోలీసు వారియెదుట సాత్త్వికనిరోధకులు ప్రార్థనలు సలుపుచు నిలవబడి బ్రాహ్మణులయొక్కయు, పోలీసువారియొక్కయు నైతికాంతఃకరణము ననేకవిధముల ప్రేరేపించుచుండిరి. దౌర్జన్య మావంతయు లేకుండ ఈ పోరాటమంతయు ప్రగాఢ మత తత్పరతతో సాగింపబడెను.

ఇట్లుండ యీప్రాంతము వరదతో ముంచెత్తబడెను. రోడ్డుమీద నీరు సాత్త్వికనిరోధకుల మొలలవరకు వచ్చెను, సంస్థానమువారు మిలిటరీ పోలీసులకు పడవలను సప్లయిచేసి రోడ్డుపొడుగున కాపలాయుంచిరి. సాత్త్వికనిరోధకుల దుస్థితి చెప్ప నలవిగాకుండెను. వారీ కష్టములన్నిటిని భరించుచు నొక్కగంటకూడ రెప్పవాల్చక యుండిరి. చిట్టచివర కనేక నెలలు గడచినతరువాత బ్రాహ్మణుల యనుమతితో సంస్థా

సమువా రీరోడ్డును తెరచిరి. వైకంపోరాటము విజయవంత మయ్యెను. దానితో నాయొక్కరోడ్డు మాత్రమే కాక తక్కిన [బ్రాహ్మణ] వీధులకును నిది విజయమును చేకూర్చెను.

# కరువులు - రాటము

కరువు ప్రదేశములో రాటమెట్లు ప్రవేశించి పనిచేసెనో చెప్పుటంత సులభము కాదు. రాటమున్న రోజులలో కరువులు లేవా యని కొందరందురు. ఉన్నమాట నిజమే కాని 1864 తరువాత వచ్చు నిరంతర కరువులవంటి కరువులెన్నడును లేవు. ఈ సంవత్సరము తరువాతనే కరువు కమిషనులు యేర్పాటు చేయబడెను. అవి యెంతసేపు ప్రభుత్వము చేయగలసహాయములో నున్నకష్టములను గురించియే చెప్పు చుండును. కరువుకలవాటుపడని వారి సహాయము నాశించుట కిష్టపడకుండిరి. దానికలవాటు పడిన పరాన్నభుక్కులై వచ్చుచుండిరి. అర్ధాకలి ప్రజలు తండోపతండములుగ సంచారము చేయుచు కుటుంబములు విచ్ఛిత్తియిపోయినపుడు అవినీతి ప్రబలుచుండును. ఎడ్వార్డుకైర్డు అనునతడు 'జీవితములను రక్షించి క్రమమును స్థాపింపగల దొక్కగ్రామసంస్థల పద్ధతిమాత్రమే' యనిచెప్పెను. చర్కావలె కరువుతాండవ మాడుచున్నవారి గుమ్మముల వద్దకే యార్జనోపాయములను

తెచ్చిపెట్టున దింకొకటి లేదు. బిడ్డలు. వృద్ధులు రోగులు దుర్బలులు, అంగహీనులు దీని నుపయోగింపగలరు. కష్టము లేకుండ దీనిని రాత్రింబవళ్లు త్రిప్పవచ్చును. 1923-24 లో బెంగాలులో కరవు ప్రాంతములందు దంపుడు పరిశ్రమను మొదట పి. సి. రే ప్రయత్నించి చూచెను. అది నిరర్థకము కాగా రాట్నము పెట్టెను, అది చక్కగా పనిచేసెను. ఆ ప్రాంతములలో నిపుడు చర్కా శాశ్వతస్థానము నేర్పరచుకొనెను. దానివలన వారుతమ స్వల్పాదాయమును పెంపొందించుకొని వరదలకు కరవులకు తట్టుకొన గలుగుచున్నారు. ఇంతవరకు మనము సాధించిన పనినిగురించియే యోచించితిమి. ఇదియే దీని భావియభివృద్ధికి సాక్ష్యము. కాని మనము మిల్లుల పోటీసంగతి చూచుట లేదని కొందరందురు. ఖద్దరుకు మిల్లువస్త్రముకు పోటీ యుండనేరదు. మిల్లులకు స్వదేశీమిల్లులకు విదేశీమిల్లులకు పోటీయుండవచ్చును. ఆవిరియంత్రములకు విద్యుద్యంత్రములకు పోటీ యుండవచ్చును. ప్రాణాధారమైన పరిశ్రమకున్నట్లుకాని దానికిపోటీ యెందుకుండవలెను? ఎట్లుండగలదు? ఇప్పుడు కావలసినది కోట్లమీదనున్న బీద వ్యవసాయకుని యార్థికదుస్థితిని పోగొట్టుట వారికి పనికల్పించుట రాటమొక్కటే యీపని చేయగలదు. ఏబదికోట్ల రూపాయల పెట్టుబడితో మిల్లులెంత పని చేయగలిగినది మన మిదివరకే చూచి యుంటిమి. దేశమునకు కావలసిన వస్త్ర

మంతయు మిల్లులమీదనే తయారైనదను కొనినను కోట్ల కొలది డొక్కమాడుచున్న ప్రజలకిది యెట్లు లాభించును? దానివలన యన్ని బాపతుల వారికి కలసి 25 లక్షలమందికి మాత్రమే పనిదొరకును. వీరికిక భూమితో సంబంధముండదు. ఇది యొక్క మనిషికి కూడ యుపపరిశ్రమను ప్రసాదింప జాలదు. కనుక మిల్లులకు రాటముకు పోలికే లేదు.

ఇక మనచేతి పరిశ్రమ వలన నెంతమందికి పనికలుగునో చూడుదు. మనకు కావలసినది 11,650 లక్షల పౌనులనూలు. అనగా 4,66,00,000 మంది రాటముల మీద పనిచేసి సంవత్సరమున కిరువదియైదు పౌనుల చొప్పున యీనూలు వడుకుదురు. ఈపరిశ్రమకు 31,07,033 నేతగాండ్రు కావలెను. వీరు గాక వేలకొలది యేకువారు ప త్తిపట్టువారు రంగువేయు వారు కమ్మరులు, వడ్రంగులు పడుగు వేయువారు. చదువుకొని లెక్కలను తయారుచేయగలవారు కావలెను. మొత్తము మీద పదేండ్లలోపు పిల్లలను తీసివేసినచో వ్యవసాయ కుటుంబములోని సగము మంది కిది పని చెప్పుచున్నది. ఇది జీవితమునకు సంబంధించిన యార్థికముల మీద నిర్మింపబడినది కనుక ప్రాణాధారమైన పరిశ్రమ 'తమ్ము బ్రతికించునట్టి యార్థిక నీతిమీదనే జాతులు వర్థిల్లవలెను' అని యొక ఋషి వచించెను. ఈపరిశ్రమవలన భారతప్రజలొక జాతివలె జీవిం

చుటయే గాక నిజమైన యైశ్వర్యము నుత్పత్తిచేసి దానిని చక్కగా పంచిపెట్టగల జాతి కాగలదు. ప్రాణమును పోయు నిట్టి పరిశ్రమను ప్రభుత్వము రక్షింప వలెననుటలో నాధిక్య మేమియు లేదు. ముఖ్యమైన తపాలా పనికిచ్చునట్టి రక్షణ వంటి రక్షణనే దీనికీయనగును. కొన్ని దేశములలో మ్యునిసిపాలిటీల 'స్వంతహక్కులను' కాపాడుచుండుట సామాన్యమైనది ఖద్దరు విషయములో మన "స్వంతహక్కులను రక్షించుటవలన ప్రభుత్వము తమ పూర్వులు చేసిన పాపమునకు పరిహారము చేసికొనుట యేయగును."

## అస్పృశ్యత - ప్రపంచ సమస్య

ఇది యొక్క భారతదేశమునకే పట్టిన దుస్థితికాదు. దక్షిణాఫ్రికా, దక్షిణఅమెరికా రాష్ట్రములలో కూడ రంగు జాతుల నిట్లే చూచుచున్నారు, నీగ్రోల నచ్చట బాధించుటకును మన మస్పృశ్యులను బాధించుటకును భేదమేమియు లేదు. ఈరెండింటి మనస్తత్వము నొక్కటియే. మనకర్మయే మనమీద ప్రతిఫలించి దక్షిణాఫ్రికాకు వలస వెళ్ళిన భారతీయులు పలువిధముల సాంఘిక బహిష్కరణమునకుగురి చేయబడుచున్నారు. "అస్పృశ్యత హిందూమతమునకు తీరని మచ్చ. దక్షిణాఫ్రికా పోరాటములోనే, నెదుర్కొన వలసిన కష్టముల వలన నాకీయభిప్రాయము కలుగలేదు. నేనొక్క

ప్పుడు దైవచింత లేనివాడ నగుటచే నిట్లుభావింప లేదు క్రైస్తవ మత గ్రంథములను చదువుటచే నాకిట్టి యభిప్రాయములు కలిగెనని కొందరనుకొనుట సరికాదు. నాకు క్రైస్తవమత సాహిత్యముతోను, ఆ ప్రజలతోను సంబంధము లేనపుడే యీ భావములు కలిగెను. నాపన్నెండవయేట యూకాఅను నస్పృశ్యుడు మాదొడ్లు తుడుచుటకు వచ్చెడివాడు, అతని నెందుకు ముట్టుకొనరాదని నేను మాతల్లిని తరుచు ప్రశ్నించెడివాడను, అతనిని నేను పొరపాటున ముట్టుకొంటినా స్నానము చేయవలసి వచ్చెడిది. నేను నాతల్లి యాజ్ఞను శిరసావహించి స్నానము చేసి నవ్వుచు యిది మతము యొక్క శాసనము కానేరదని వాదించుచు ననేక సార్లు నాతల్లిదండ్రులతో తగువు లాడెడివాడను. యూకాను తాకినంత మాత్రమున పాపమంటదని నా తల్లితో చెప్పెడివాడను. పాఠశాలలో నేను తరచు అస్పృశ్య బాలురను ముట్టుకొనుచు మాతల్లితో చెప్పుచుండెడివాడను. మా తల్లి దీనికి విరుగుడుగ నొక ముస్లిము బాలుని ముట్టుకొనుటయే యని చెప్పెడిది. మాతల్లి యెడ నాకు గల గౌరవముచే నేనట్లే చేసెడివాడను. కాని యది మతధర్మమని నేనెన్నడు భావింప లేదు.

మాయింట రోజు రామాయణము చదివెడివారు. ఒక బ్రాహ్మణుడు వచ్చి దీనిని పఠించెడివాడు. అతనికి కుష్టు

రోగము సంభవించెను. రామాయణము చదువుట వలన నదిపోవునని యతఁడు విశ్వసించెను. అది యట్లే తగ్గిపోయెను. అస్పృశ్యునిగ నేఁడు భావింపబడు గుహుఁడు తన పడవలో రాముని గంగానది దాటించెను. అట్టి రామాయణ మే మానవునైనను మలినాత్ముఁడను నెపమున అస్పృశ్యునిగ భావింపమని యెట్లు ప్రోత్సహింపగలదు?

భగవంతుఁడు మలినాత్ములను పవిత్ర పరచువాఁడని మనము పిలుచుటను బట్టి హిందూమతములో పుట్టిన వారి నట్లుభావించుట పాపము. రాక్షసకృత్యము. నే నీవిషయము నప్పటి నుండియు విసుగు లేకుండ చెప్పుచుంటిని. నేను సనాతన హిందువునని యెప్పుడును చెప్పుచుందును. నాకు మత గ్రంథములు బొత్తిగా తెలియక పోలేదు. సంస్కృతములో నేను గొప్ప పండితుఁడను కాను. వేదములను ఉపనిషత్తులను నేను అనువాదములోనే చదివితిని. కనుక నేను పాండిత్య ప్రతిభతో వానిని చదువలేదు. కాని నేను హిందువుగా వానిని చదివి వానిలోని సారమును గ్రహించితినని మాత్రము చెప్పగలను. ఇరువది వత్సరములు నిండిన తరువాత నేను యితర మతములను కూడ పఠించితిని. 'అస్పృశ్యత' హిందూమతములో నొక భాగము కాదను విషయము గ్రహించు వరకు అంటరాని తనమును తొలగించు వరకు మనకు స్వరాజ్యము రాజాలదని నేనుచాటితిని. నే నేమతము

నవలంబింతును! యనుసందేహమొకసారి నాకు కలిగినను హిందూమతము ద్వారానే నాకు మోక్షము కలదని నిశ్చయించుకొంటిని. హిందూమతము పట్ల నావిశ్వాసము మరింత గాఢమయ్యెను. నేను మరింత ప్రబోధము పొందితిని. కాని అప్పుడు కూడ నేను అస్పృశ్యతను నిరాకరించితిని. ఏది జైన, వైష్ణవమతముల పునాదియో తులసీదాసు దేనిని గురించి విశ్వగానము చేసెనో యేది భాగవతపరమార్థ ప్రతిపాదకమో యేది గీతలోని ప్రతి శ్లోకములో నంతర్గర్భితముగా నున్నదో యట్టిదయ, ప్రేమ విశాలభావము, భారత ప్రజలలో క్రమముగా వృద్ధి చెందుచున్నదని నేను గ్రహించితిని.

నేనొక జాతీయవారమునాడు నెల్లూరులోనుంటిని. అచ్చటి యస్పృశ్యులతో కలసి నేనిట్లు ప్రార్థించితిని. నే నాధ్యాత్మిక మోక్షమును కోరుదును. నాకు పునర్జన్మయక్కర లేదు. నేను తిరిగి పుట్టవలసివచ్చినచో అస్పృశ్యునిగ పుట్ట గోరుదును. అప్పుడు నేను కూడ వారిబాధలను దుఃఖములను. అవమానములను భరించి వారిని నన్ను కూడ తరింపచేసికొందును. కనుక నేను తిరిగి పుట్టవలసివచ్చినచో బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రజన్మలను కాక అస్పృశ్యునిగ నే పుట్టగోరుదును.

# అస్పృశ్యులేమిచేయవలెను?

నాకు దొడ్లు తుడుచుటయం దాసక్తి కలదు. నాయాశ్రమములో పదునెనిమిదేండ్ల బ్రాహ్మణ యువకుడు దొడ్డిపని చేసి యాశ్రమములో పని చేయువాని కెట్లు పరిశుభ్రతను పాటింపవలెనో చూపించును. ఈ బ్రాహ్మణ యువకుడు సంస్కారప్రియుడు కాడు. ఇతడు శ్రోత్రియ కుటుంబములోనే పుట్టి పెరిగెను. ఇతడు నిత్యము గీతను పఠించును అతి భక్తి విశ్వాసములతో ప్రార్థన సేయును. ఇతడు ప్రార్థన సేయునపుడితని మృదు మధుర గానము మనలను ప్రేమతన్మయులను చేయును. దొడ్లుతుడుచుట కూడ పవిత్ర కార్యమని యతడట్లు చేసి చూపించినకాని తన సాధన పూర్తికానేరదని భావించెను. ఆశ్రమములో పనిచేయు దాదికి తానే యీ యుదాహరణమును చూపవలెనని యతడు భావించెను.

హిందూసమాజమును మీరు శుభ్రము చేయుచున్నారని గ్రహింపవలెను. కనుక మొదట మీరు జీవితములను పవిత్రము చేసి కొనవలెను ఇతరులు మీవంక వేలెత్తి చూపనక్కర లేకుండ మీకు మీరు పరిశుభ్రముగనుండుట నేర్చుకొనవలెను. మీలో కొందరకు త్రాగుడు జూదము మొదలగు దురభ్యాసములు కలవు వీటిని మీరే తొలగించుకొనవలెను. హిందువుల మని మీరు చెప్పుకొను చున్నారు.

మీరు హిందూ మత గ్రంథములను చదువుచుందురు. హిందువులు మిమ్ము బాధించుచో నది హిందూమతము యొక్క దోషము కాదని యా మతస్థులమని చెప్పుకొనువారి దోషమని మీరు తెలిసికొనవలెను. మిమ్ముద్ధరించు కొనుటకు మీకు మీరే పరిశుద్ధులు కావలెను. మీరు మద్యపానము, గొడ్డుమాంసము తినుట మానవలెను. నేను భారతదేశములో నున్న అస్పృశ్యులందరను చూచితిని. వారిలో నంతర్గర్భితముగ గొప్ప శక్తులు కలవని నేను గ్రహించితిని. ఇది వారికి తక్కిన హిందువులకు తెలిసినట్లు నాకు తోచదు. వారి బుద్ధి అనావిద్ధరత్నము వంటిది, మీరు రాటము నేత చేపట్టవలెను. వీటిని మీరు వృత్తిగా చేపట్టితిరేని దారిద్ర్యము మీదరికిరాదు నేను మీకు బోధించినదంతయు మీరు చేయగలిగితిరేని మీ మోక్షమును మీరు సాధించుకొనగలరు. ఇతరులు తినిపారవేసిన యెంగిలిని, పుల్లివిస్తరాకులను మీరు ముట్టుకొనరాదు. అవి యెంత శుభ్రముగా నుండునని చెప్పుబడినను మీరు నమ్మరాదు. ముట్టరాదు. ప్రేమతో నీయబడు ధాన్యాదులను మాత్రమే తీసికొనుడు. స్వతస్సిద్ధముగ హిందువులు పాపమున కొడిగట్టువారు కారు. వారజ్ఞానములో మునిగియున్నారు, ఈ వత్సరములోనే యస్పృశ్యత పోవలెను. గోసంరక్షణము, అస్పృశ్యతానివారణము, ఈ రెండు కోరికలే నా బొందిలో ప్రాణముండుటకు కారణ

ములు. ఈరెండు యీడేరిననాడు స్వరాజ్యము వచ్చును. అదియే నాయాత్మకు మోక్షము. భగవంతుడు మీయాత్మ మోక్షమునకు తగిన బలమును చివర వరకు మీకొసంగుగాక!

# గాంధీజీ - కొన్ని యుపోహలు

ప్ర:- మీజాతీయ పునరుద్ధరణ ప్రణాళికలో కళకు స్థానము లేదని ప్రఖ్యాతి గాంచిన కొందరు పెద్ద లే యను చున్నారు. ఇది నిజమేనా?

జ:- ఈ విషయములో ప్రజలు నన్ను సరిగా అర్థము చేసికొనుటలేదు దీనిని నేనే విశదము చేసెదను. ఈ సందర్భ ములో రెండుభావములు కలవు. ఒకటిబాహ్యము, రెండవది యాంతరంగికము. నేను రెండవదానికి ప్రాధాన్యమిత్తును. అంతరంగికమునకు దోహద మీయని కళను నేనంగీకరింప జాలను. యదార్థమైన కళ యాత్మను వ్యక్తీకరింపవలెను. మానవుని యంతరంగతత్త్వమును వ్యక్త పరుచునపుడే బాహ్యరూపములకు విలువ యేర్పడును. ఆత్మవికాసము, నాత్మసంక్షోభము నెంతమాత్రము ప్రదర్శింపని వారనేక మంది తాము కళావేత్తలమని చెప్పుకొందురు. అట్టి కళ నాకర్థము కాదు. ఆత్మతన యంతరంగతత్త్వమును గ్రహిం చుటకు కొరకే నిజమైన కళ ప్రయోజనకారి కావలెను. నావిషయములో నాయాత్మను గ్రహించుటకు బాహ్యరూప

ము లేవియు నా కవసరము లేదు. నాపరిసరములందు మీారను కొనునట్టి కళారచన లేకపోయినను నాజీవితములో కావలసి నంత కళ కలదనియే నేను చెప్పగలను. నా గదిగోడలమీాద నెట్టి యలంకరణములు లేకపోవచ్చును, దానికి కప్పుకూడ లేకపోవచ్చును. అప్పుడు నే నపరిమేయ నక్షత్రలోకాలంకృత నభోశోభ నే సరాసరి యనుభవింపగలను. ఏమానవుడు తనబుద్ధిప్రభావముచే నిట్టి నక్షత్రకాంతిపుంజముచే నొప్పు రంగస్థలమును రచింపగలడు! అనగా మానవవులచే సృజింపబడుకళాకౌశలమునకు విలువ లేదని యర్థము కాదు. ప్రకృతిలో గల శాశ్వత సౌందర్య చిహ్నములతో పోల్చినచో నివియొంక లెక్కలోనికి రావనిమాత్రమే నాయభిప్రాయము.

సత్యము ద్వారా నేను సౌందర్యమును చూతును, కనుగొందును. నిజమైన భావములే కాక నిజమైన ముఖములు, నిజమైన చిత్రములు, నిజమైన గీతములు, అన్నిసత్యములు, పరమసౌందర్యప్రదములు. మానవులు 'సత్యములో' సౌందర్యమును చూడగలిగిననాడు కళ యుత్పన్నము కాగలదు.

ప్ర:- సత్యము నుండి సౌందర్యమును, సౌందర్యము నుండి సత్యమును విడదీయుటకు వీలు లేదా?

జ:- సౌందర్య మననేమి? అందమైన ముఖలక్షణము లున్నంతమాత్రమున నొకస్త్రీ సౌందర్యము కలది యగునా?

ఆమె గుణవంతురాలు కానిచో సౌందర్యవంతురాలు కాజాలదు. బాహ్యరూపమే యొక వస్తువున కందమిచ్చుటలేదు. నిజమైన కళావేత్తకు బాహ్యాకారమెట్లున్నను ఆత్మసత్యముతో వెలుగొందు ముఖమే సౌందర్యవంతముగ కన్పించును. అప్పుడు సౌందర్యము సత్యము వేరుగా నుండుటలేదు. బాహ్యమెంత మాత్రము అందముగ లేకున్నచోట సత్యము ద్యోతకము కావచ్చును. సోక్రటీసు తనకాలము వారందరికంటె మహాసత్యవంతుడు. కాని గ్రీసు దేశములో నంతయందవికారి యింకొకడు లేడని చెప్పుదురు. అతని జీవితమంతయు సత్యముతో నిరంతరపోరాటమే కనుక నామట్టుకతడందగాడే యగుచున్నాడు. కళావేత్తయైన ఫిడియసు బాహ్యాకారములతో సౌందర్యమును చూచువాడే యైనను సోక్రటీసు యొక్క సత్యములోనున్న సౌందర్యమును కూడ గ్రహింపగలిగెనను విషయము మనకు తెలియునదికాదు.

ప్ర:- జీవితశోభ నెరుగని వారెందరో సుందర వస్తువులను సృజించిరి కదా!

జ:- అవును. అనగా సత్యము అసత్యము కూడ యీ సృష్టిలో నుండుననియె దానిభావము. మంచిచెడ్డలు రెండును తరచు కలిసియేయుండును. కళావేత్తలో కూడ మంచి, చెడ్డ, తప్పు, ఒప్పు భావములు రెండును కలిసియే యుండవచ్చును. నిజమైన సౌందర్యకళాఖండములు యుక్తదృష్టికలవారిచేతనే

సృజింపబడగలవు. జీవితములో నిట్టిఘడియ లరుదైనచో కళలో కూడనట్లే యుండును.

ప్ర-: నీతి యవినీతి యను ప్రసక్తి లేనిచోట సత్య ముండునా? సూర్యోదయము, నక్షత్రరాశిమధ్య ప్రకాశించు చంద్రుడుకలరు. వీరిలో సత్యమున్నదా?

జ:- తప్పక కలదు. వాటివెనుక నున్న సృష్టికర్తను గురించి ధ్యానించుటకే నన్నవి ప్రోత్సహించుచున్నవి కనుక నీ సౌందర్యప్రతిమలు సత్యములు. సృష్టికేంద్రము సత్యము కానిచో వీనికందచందము లెక్కడివి? సంధ్యారాగశోభను, పున్నమ చంద్రకాంతిని చూచి నేనానందపడునపుడు నా యాత్మ సృష్టికర్తను సేవించుట కుఱ్ఱూరుచుండును. అతని యీ రచనలద్వారా నేనతనిని, యతని యపార దయను చూడగోరుదును. కాని యీసూర్యోదయ సూర్యాస్తమయములు నన్నతనినిగురించియే ధ్యానించుట కుప యోగపడనిచో నివికూడ నిరర్థకములే. మోక్షమార్గమున కీశరీరమే యడ్డమగుచుండునట్లు ఆత్మోన్నతికి తోడ్పడని దేదియైనను భ్రమ, బంధనము మాత్రమే కాగలదు.

ప్ర-: అయ్యా! తమరు యంత్రములే కూడదనుట నిజ మేనా?

జ:- ఈశరీరమే యొకచక్కని యంత్రమని నేను భావించునపుడు యంత్రము కూడదని నేనందునా? రాటమే యొక

యంత్రము. యంత్రముల యెడల మోహముండరాదని మాత్రమే నేనందును. యంత్రముపట్ల నాకు ద్వేషములేదు. "శ్రమనురక్షించు" యంత్రముల కొరకు తహతహ పడు చున్నాము. మానవులు, "శ్రమనురక్షించు" కొనుచు పోయి, వేలాది వేలప్రజలన్నాతురులై తిండి లేక యాకలి బాధచే రోడ్లమీద పడి చనిపోవునట్లు చేయుచున్నారు. కాలము, శ్రమ, రక్షింపబడవలె ననియే నేనుకోరుదును. కాని యది యేకొద్దిమందికో కాక మానవలోకమునకంతకు సాధ్యపడవలెను. ధనమే కొద్దిమందిచేతిలోనో కాక యందరి కిని లభ్యముకావలెనని నేను కోరుదును. నేడు యంత్రమేమి చేయుచున్నది! కొద్దిమంది లక్షలకొలది ప్రజలమీద స్వారి చేయుటకే యది యుపయోగించుచున్నది. దీని వెనుకనున్న కోరిక ప్రజలను రక్షింపవలెనను దయాబుద్ధి కాదు. పేరా సయే దీనికి కారణము. ఇట్టి లక్షణముండరాదని నేను నా యావచ్ఛక్తితో పోరాడుచున్నాను.

ప్ర:- అసలు యంత్రములతో మీకు విరోధము లేదు. వాటిని దుర్వినియోగము చేయరాదనియే మీవాదన.

జ:- నిజము, ఇది ముమ్మాటికి నిజము, నేటి శాస్త్ర ములు కనిపెట్టు సత్యములు, నూతనముగ కనుగొనబడునవి యన్నియు యాశకుమాత్రమే యుపకరను లగుచున్నవి. మొట్టమొదట యీదృష్టి తగ్గవలెను. ఇది తగ్గిన నాడు పని

చేయు పాటకజనులను పీడించుచున్న యత్యధిక పని భారము తగ్గును. అప్పుడు యంత్రములు ప్రజలను పీడించుటకు బదులు సహాయము చేయును. యంత్రముల నసలు తీసి వేయవలసిన దని నేనుకోరుట లేదు. కాని వాటిని నియమింపవలెను.

ప్ర:- ఆవిరి, విద్యుత్తు ఇత్యాది శక్తులచే నడిపింపబడు గజిబిజి యంత్రము లుండనవసరము లేదని దీని యర్థము కాదా?

జ:- అవి యుండకపోవచ్చును. వాటికంటె మానవుడు ముఖ్యమను విషయము మరువరాదు. యంత్రము మానవుని యవయవములనే వ్యర్థమొనరింపరాదు. కాని న్యాయమైన మినహాయింపులను నేనంగీకరింతును. సింగరు కుట్టుమిషను కలదు. ఇది యత్యంత యుపయోగకరమైన యంత్రము. దీని వెనుక నొక ప్రేమగాథ కూడకలదు. తనభార్య చేతికుట్టు కుట్టుచు నెంతయో బాధపడుచుండ సింగరు చూచి యామె యెడగల ప్రేమచే నతడు కుట్టుమిషనును కనిపెట్టెను. అట్లు చేసి యతడామె కష్టమునే కాక సింగరుయంత్రమును కొన గలవారి యందరి పని తేలికచేసెను

ప్ర:- కాని యీ సింగరు కుట్టుయంత్రమును తయారు చేయుటకొక ఫ్యాక్టరీ, ఆవిరియంత్రములు కావలెనుకదా?

జ:- కావలెను. కాని యట్టి ఫ్యాక్టరీలను ప్రభుత్వమే నడుపవలెను. నేనంతమాత్రము సోషలిష్టునే యగుదును.

అవి యందరను ఆకర్షించు విధముగ లాభముకొరకు గాక మానవకళ్యాణము కొరకు పనిచేయవలెను. ఆశకు బదులు ప్రేమ వానిని నడిపింపవలెను. పనిచేయువారి స్థితిగతులలో మార్పు కలుగవలెను, ఈడబ్బుపిచ్చి మానవలెను. పనిచేయు వానికి బ్రతుకుటకు తగిన కూలి, నిత్యముపని, ఎద్దుమొద్దుచాకిరీయుండకపోవుట కావలెను. ఇట్టి పరిస్థితులలో పనిచేయు యంత్రము పనివానికి ప్రభుత్వమునకు గూడ లాభదాయకముగనే యుండును.

ప్ర:- వివాహ వ్యవస్థకు మీరు వ్యతిరేకమా?

జ-: ఈ ప్రశ్నకు కొంత యాలోచన పూర్వకముగ జవాబు చెప్పవలెను. మానవజీవిత పరమార్థము మోక్షము. నేనుహిందువును. కనుక నాకు మోక్షమనగా జన్మరాహిత్యమని నావిశ్వాసము. శరీరబంధములను త్రెంచుకొనుట, భగవంతునితో నైక్యమగుట. ఈపరమలక్ష్యమును సాధించుటకు వివాహము, శరీరపాశములను బిగించునదే కనుక, నాటంకమే యగుచున్నది. బ్రహ్మచర్యము భగవంతున కాత్మార్పణ మొనరించు జీవితమును ప్రసాదించును కనుక గొప్పప్రయోజనకారి. వివాహమనగా సామాన్యముగ తన సంతును పునః పునఃసాగించుటనియే కాదా భావింపబడుచున్నది. దీనికి వివాహము నేల సమర్థింపవలెను? మానవజాతి, దానికదే పెరుగ

గలదు. దానిని వృద్ధి చేయుటకొక సాధన యుండనక్కర లేదు.

ప్ర:- అయినచో బ్రహ్మచర్యమును గురించి మాత్రము బోధలు తత్త్వోపదేశములు యెందుకు?

జ:- అది యవసరము. దాని వలన సృష్టియే యాగిపోవునని భయము కాబోలును. అట్టిభయమేమియు లేదు. దీని వలన మానవ జాతియంతరింపదు. దీని న్యాయమైన ఫలితమేమనగా మానవజాతి యుత్తమస్థాయి నలంకరించును.

ప్ర:_ ఒకకవి, కళావేత్త. గొప్పప్రతిభాశాలి తన సంతానముద్వారా లోకమునకు తన ధీసంపన్నత నందింపవచ్చును కాదా?

జ:- అట్టి యవసరము లేదు. అతనికుండగల బిడ్డల కంటె చాలయెక్కువమంది శిష్యులేయతని కుందురు. అతనిశిష్యుల ద్వారా (యతడు మరేవిధముగను చేయజాలనట్లు) తనశక్తులను ప్రజల కందింపగలడు. అదియాత్మతనతత్త్వముతో వివాహము చేసుకొనుట యేయగును. శిష్యుడే సంతానము. ఇది యొకదివ్య సంతానసృష్టి. ఇకవివాహమా! దానిసంగతదియే చూచుకొనుగాక! అచట సంఖ్యాభివృద్ధియే కాని వికాసము కలుగుట లేదు. నేడు వివాహములో కామమునకే యతి ప్రధానస్థానమేర్పడినది.

ప్ర:-అయితే సత్యము సౌందర్యము, నొకేవస్తువుయొక్క వివిధ దృక్పథములు మాత్రమే కాదా?

జ:- మొదట సత్యమునారాధింపవలెను. తరువాతశివ, సుందరములు వాటంతటవియేనీకు చేకూరగలవు. జీసను తన 'పర్వతసందేశము'లో దీనినే యుద్ఘాటించెను, జీససుసత్యమును చూచిదానిని వ్యక్తముచేసెను కనుక నతడు పరమ కళావేత్తయని నాభావము. మహమ్మదుకూడ నట్టివాడే. అరబు సాహిత్యములో కొరాను అత్యంతనిరుపమమైన సాహిత్యమనిపండితులు చెప్పుదురు. వారిద్దరు మొదటసత్యమునేచూచిరి కనుక భావసహజముగా, దానంతటదియే వచ్చును. కాని వారిద్దరు కళనుగురించి యేమియువ్రాయలేదు. నేనట్టిసత్యము, సౌందర్యము కొరకే వాంఛింతును! వాటికొరకే జీవింతును. వాటికొరకే చనిపోగోరుదును.

ప్ర:-సింగరు యంత్రమువంటి మినహాయింపులు కలవందురుకదా వీటికంతు యెక్కడనుండును?

జ:-అవిమానవునకు సహాయము చేయుటకు బదులువాని వ్యక్తిత్వమునే యపహరించునపుడు వాటికిస్వస్తి చెప్పవలెను. యంత్రము మానవుని యవయవములనే భంగపరచరాదు.

ప్ర:-సింగరు యంత్రమువలె మోటారుకారు నేల వాడుకొనరాదు. ఆదర్శమునకైనచో నన్ని యంత్రములును పోనక్కరలేదా?

జ:-మోటారుకారు మానవుని ప్రధాన కోరికను దేనిని తీర్చుటలేదు. మోటారుకారుకు గల వేగమువంటి వేగముతో మానవుడు దూరములను లంఘించుటకు ప్రధానావసరము కాదు. ఆవశ్యమున కైతే. నేను యంత్రముల నన్నింటిని కాదందును. మోక్షమునకు సహాయకారి కాని ఈశరీరమును కూడ నిరాకరించి నేను పరిపూర్ణాత్మ మోక్షమునే కోరు చుంటిని. ఈదృష్టిలో నేను యంత్రములను నిరాకరింతును కాని యంత్రములు శరీరమువలెనే పోవునవి కావు. అవితప్పని సరియైనవి. శరీరమే యతిపవిత్రమైన యంత్రమని నేనంటిని. అయినను పరమాత్మ సాధనకది యభ్యంతరకరమైనపు డదియును విడువబడవలసిన దే.

# రాజభక్తి రాజద్రోహముగా మారుట

1922 లో మహాత్ముని మీద రాజద్రోహనేరము మోప బడినపు డతడీ క్రింది వాఙ్మూలము నిచ్చెను-

"అత్యంత రాజభక్తుడను సహకారవాదినైన నేను తిరుగు లేని రాజద్రోహిని. అసహాయవాదిని యగుటకుగల కారణ ములను భారత ప్రజలకు, ఆంగ్ల ప్రజలకు కూడ తెలుపవలసి యున్నది. భారతదేశమున చట్ట ప్రకారము స్థాపింపబడిన ప్రభుత్వము పట్ల రాజద్రోహమును పురికొల్పు దోషమును చేసితినని నేను కోర్టువారికి కూడ మనవి చేయువలసియున్నది.

నా ప్రజాజీవితము 1893 లో దక్షిణాఫ్రికాలో సంక్షుభిత వాతావరణములో ప్రారంభమయ్యెను. ఆ దేశములో

నుండిన బ్రిటిషు ప్రభుత్వముతో నాకు తటస్థించిన మొట్ట మొదటి యనుభవమే సుఖప్రదమైనదిగా లేదు. మానవు డను, భారతీయుడనునైన నాకచ్చట నెట్టిహక్కులు లేవని నేను తెలిసికొంటిని. అసలు నిజము చెప్పవలెననిన నేను భారతీయుడను గనుకనే నాకు మానవహక్కులు నిరాకరింప బడెనని నేను తెలిసికొంటిని. కాని నేను దీనికి భయపడ లేదు. భారతీయుల నిట్లు నిరసనగా చూచుట యొక్క పద్ధతిలో సంక్రమించిన చీడయని నేను భావించితిని. అట్లు భావించి నే నా ప్రభుత్వముతో నైచ్ఛికముగ, హృదయపూర్వకముగ సహకరించుచు నది దోషము లొనరించినపుడు స్వేచ్ఛగా విమర్శించు చుంటిని. కాని యది నశింపవలెనని నేనెన్నడు కోరలేదు. కనుకనే 1899లో బోయర్లు తిరుగుబాటు చేయఁగా సామ్రాజ్యమునకే మోసము కలిగినపుడు నేను ఐచ్ఛికభట దళమును స్థాపించి యనేక రంగములలో పనిచేసి ప్రభుత్వ మునకు సేవ చేసితిని. అట్లే 1906లో జూలూ తిరుగుబాటు జరిగినపుడు కూడ నేనొక రోగచికిత్సక దళమును స్థాపించి 'తిరుగుబాటు' పర్యవసానము తేలువరకు సేవ చేసితిని. ఈ రెండు యుద్యమములలోను నాకు పతకములను బహూక రించుచు నా సేవను గురించి ప్రభుత్వ పత్రములలో వ్రాసి కొనిరి. నా దక్షిణాఫ్రికా సేవకు హార్డింజి ప్రభువు నాకు 'కైసరీ హిందు' సువర్ణపతకము నొసంగెను. 1914 లో ఇంగ్లండు జర్మనీల మధ్య యుద్ధము పొసగినపుడు నేను

లండనులో నొక ఐచ్ఛికదళము నచ్చటనున్న విద్యార్థులతో స్థాపించితిని. దాని సేవ చాల ముఖ్యమైనదని యధికారులు పొగడి తిరిగి 1918లో ఢిల్లీలో జరిగిన యుద్ధకాన్ఫరెన్సులో చెల్మ్స్ఫర్డు ప్రభువు యుద్ధమునకు జనము కావలెనని కోరినపుడు నా యారోగ్యమును కోల్పోయి కైరాజిల్లాలో నేనొక దళమును లేవదీసి రాజీ కుదురువరకు పని చేసితిమి. నా ప్రజలకు సామ్రాజ్యములో సమాన ప్రతిపత్తి లభ్యము కాగలదను విశ్వాసముతోనే నేనిట్టి సేవ చేసితిని. రౌలటు చట్టము నాకు మొట్టమొదటి దెబ్బ. అది నా ప్రజల నిజస్వేచ్ఛ నపహరించుటకు చేయబడిన చట్టము. నేను దానిని తీవ్రముగ ప్రతిఘటింపదలచితిని. వెంటనే జలియను వాలాబాగు హత్యలతోగూడిన పంజాబు దురంతములు గావింపబడి పొట్టలమీద ప్రాకించుట, బహిరంగముగ కొరడాదెబ్బలు కొట్టించుట మొదలగు వచింపరాని యకృత్యములు జరిగెను. ప్రధాన మంత్రి ముసల్మానులకు చేసిన కిలాఫతు వాగ్దానమును నెరవేర్పడని కూడ నేను తెలుసుకొంటిని. అయినను 1919 అమృతసర్ కాంగ్రెసులో నేను స్నేహితులువలదని వారించుచున్నను, మాంటేగు చెమ్స్ఫర్డు సంస్కరణలతో సహకరింపవలసినదనియే పోరాడితిని. ప్రధానమంత్రి తమతప్పిదములను దిద్దుకొనునని యాశించితిని. కాని నాయాశలన్నియు నడియాసలయ్యెను. కిలాఫతు వాగ్దానము గాలికెగురగొట్టబడెను. పంజాబు నేరముల విషయము, హంటర్ కాకిచేయుటయే గాక నేరము చేశినవారు

శిక్షింపబడకపోగా ప్రభుత్వసేవచేయుచు పింఛనులను కూడ తీసికొనుచుండిరి. కొంతమందికి బహుమతులు కూడ యిచ్చిరి, సంస్కారములలో నెట్టి హృదయపరివర్తనము లేకపోగా యవి భారతదేశమునుండి మరింత హెచ్చు ధనమును తరలించుకొనిపోవుటకును, బానిసత్వమును సాగించుటకును దోహదము చేసెను.

ఆర్థికముగను, రాజకీయముగను భారతదేశము బ్రిటిషువారి సంపర్కమువలన మున్నెన్నడు నెరుగనంత యసహాయస్థితికి వచ్చినట్లు నేనుగ్రహించితిని. నిరాయుధులైన భారతదేశము తనమీదకు దండెత్తివచ్చు వారితో నాయుధములతో పోరాడజాలదు, కనుకనే వలసరాజ్యము సంపాదించుటకే చాలపురుషాంతరములు పట్టునని మనలో పెద్దల యభిప్రాయము. అది కరువులకు తట్టుకొనజాలనంతటి దారిద్ర్యము ననుభవించుచున్నది.

బ్రిటిషువారు రాకపూర్వము భారతదేశము లక్షలకొలది తన కుటీరములలో వడకుట, నేయుట నిరంతరము సాగించుచు తన వ్యవసాయిక ఆదాయమునకు మరింత యాదాయమును చేకూర్చుకొనుచుండెను. ఆంగ్లాధికారుల సాక్ష్యములను బట్టియే యీప్రాణదాయకమైన గృహపరిశ్రమ నమ్ముటకు వీలులేనంతటి క్రూరముగను, అమానుషముగ నశింపుచేయబడెను.

భారతగ్రామములలోనున్న యర్థాకలి ప్రజలు క్రమముగ మృతప్రాయులగుచున్నారను సంగతి పట్టణవాసులకు తెలియు

కున్నది. తామనుభవించుచున్న కొద్దిపాటి భోగము విదేశ దోపిడిగాళ్ల వలన తాము పొందుచున్న దళారిద్రవ్యమని, యీదళారిద్రవ్యము లాభములు ప్రజలనుండి గుంజుకొన బడుచున్నవనియు వీరికి తెలియకున్నది. ప్రజలనుదోచుకొనుటకే బ్రిటిషుయిండియాలో చట్టము ప్రకారము స్థాపింపబడిన ప్రభుత్వము పనిచేయుచున్నదను సంగతి వీరికి తెలియకున్నది.

అనేక గ్రామములలో మనకంటికి ప్రత్యక్షముగ కన్పించు యెముకలపోగుల నెట్టి బూటకవాదము, లెక్కల గారడీ మభ్యపరచజాలను. పైన భగవంతుడేయున్నచో భారత దేశములోని పట్టణవాసులు, యింగ్లండు యెప్పటికైనను దీని కుత్తరవాదులు కాకతప్పదు. మానవుని పట్ల జరుపబడిన యీనేరమునకు ప్రపంచచరిత్రలో సాటియే కాన్పించదు.

ఇచ్చటనున్న న్యాయశాస్త్రము విదేశదోపిడిగాళ్లను సేవించుటకే యేర్పరుపబడెను. పంజాబు సైనికశాసనము క్రింద వేయబడిన శిక్షలు నూటికి తొంబదియైదు కేవలము దురన్యాయము. భారతదేశములోని రాజకీయనేరములక్రింద శిక్షింపబడిన వారిలో పదిమందిలో తొమ్మండుగురు నిరప రాధులని నాయనుభవముద్వారా నేను తెలిసికొంటిని. తమ దేశమును ప్రేమించుటే వారు గావించినదోషము. యూరపి యనులకు భారతీయులకు మధ్య తగాదాలలో నూటికి తొంభైతొమ్మిది భారతీయులకు న్యాయము దొరకెడిది కాదు, ఇదియతిశయోక్తి కాదు. ఈ కేసుల యనుభవముగల భార తీయులందరిది యిదే యభిప్రాయము బుద్ధిపూర్వకముగనో

యబుద్ధిపూర్వకముగనో దోపిడిబాడ ప్రయోజనము కొఱకే న్యాయపరిపాలన వ్యభిచరింపబడుచున్నదని నా యభిప్రాయము.

అన్నిటికంటె గొప్ప దురదృష్టమేమన యింగ్లీషు అధికారులు వారితో పరిపాలన విధానములలో సహకరించుచున్న భారతాధికారులు నేను వర్ణించిన నేరమును చేయుచున్నట్లే యెఱుంగరు. చాలామంది యాంగ్లాధికారులు భారతాధికారులు తాము ప్రపంచములోగల యొక మంచిపద్ధతి ద్వారా పాలనజరుపుచున్నట్లు భారతదేశము నెమ్మదిగానైనను క్రమముగా వృద్ధి చెందుచున్నట్లు మనఃపూర్వకముగా విశ్వసించుచున్నారను సంగతి నేనెఱుగుదును. చంపివేసెదరను భయమును పురిగొల్పు రాజకీయపద్దతి, ఫిరంగులు మొదలగు యుద్ధసామాగ్రితో కూడిన దౌర్జన్యప్రదర్శనము యెదిరించుటకు, యాత్మరక్షణ చేసికొనుటకు తగిన శక్తియుక్తుల నన్నింటిని లేకుండచేసిన పద్ధతివలన ప్రజలు నిర్వీర్యులై పోయిరి; వారు చైతన్యహీనులై బానిసత్వమున కలవడి పోయిరి. పరిపాలకులీయలవాటును గుర్తింపకపోవుటచే తమ్ముతాము వంచనచేసికొనుచున్నారు.

భారతపౌరుని స్వేచ్ఛ నణచివేయుటకు కనుగొనబడిన భారతదేశ శిక్షాస్మృతిలో యిపుడు నా మీద మోపబడిన 124-ఎ నేరము తలమానికము. ప్రేమ, చట్టము ద్వారా తయారు చేయబడగల వస్తువు కాదు. అట్లు నియమింపబడు నదియును కాదు. ఒక వ్యక్తిపట్ల, పద్ధతిపట్ల ప్రేమ లేనపుడు

దౌర్జన్యమును పురికొల్పుట, యుద్దేశించుట, ద్రోహాదము చేయుట లేనంతవరకు మనము వానిసివ్యక్తము చేయుటకు సంపూర్ణావకాశముండవలెను. నన్ను, శంకర్లాల్ బాంకరును విచారించుచున్న సెక్షను ప్రేమను, ద్రోహాదము చేయుటయే నేరముగా నెంచబడు సెక్షను, ఈ సెక్షను క్రింద శిక్షింపబడినవారి కేసులను నేను కొన్నింటిని తెరచిచూచితిని. భారత దేశము చే నత్యంతము ప్రేమింపబడు దేశభక్తులనేకరనో యీ సెక్షను క్రింద శిక్షించిరని నేనెఱుగుదును. కనుక యీ సెక్షను క్రింద నాపై నేరము మోపబడుట నా యదృష్టమనియే నేను భావించెదను.

నాలో ప్రభుత్వముపట్ల ప్రేమలేకపోవుటకు గల కారణములను క్లుప్తముగ వెల్లడించితిని. ఏ యధికారిపట్ల, యేను లోను రాజుపట్ల వ్యక్తిగతముగ నాకెంతమాత్రము ద్వేషము లేదు. కాని భారత దేశమున కిదివరకే ప్రభుత్వము చేయని యపకారము చేసిన పద్ధతిపట్ల స్నేహభావము లేకపోవుట గుణమనియే నేను భావించుచున్నాను. బ్రిటిషు ప్రభుత్వము క్రింద భారత దేశము మున్నెన్నడు నెరుగనట్లు తన మగతనమును కోల్పోయినది. ఇట్టి విశ్వాసముండుటచే నీప్రభుత్వ పద్ధతిని ప్రేమించుట పాపమనియే నేను తలంచుచున్నాను, నామీద రుజువు పరచబడిన సాక్ష్యములుగా పేర్కొనబడిన వ్యాసములను అసహాయోద్యమమును చూపించుట ద్వారా యింగ్లండుకు నా దేశమునకు కూడ సేవచేసితిననియే నేను భావించుచున్నాను. ఇది యీ యుభయుల మధ్యగల

యసహాజజీవితము నంతరింపజేయు మార్గము. మంచితో సహకరించుట యెంతవిధాయికమో చెడుగుతో సహకరింపకుండుట కూడ యంత విధాయికమనియే నాయభిప్రాయము. ఇంతవరకు చెడ్డచేసినవానిపై దౌర్జన్యము ద్వారా యిది ప్రదర్శింపబడుచుండెడిది. దీనివలన చెడ్డ మరింత యెక్కువగుచుండుననియు దౌర్జన్యము వలననే చెడుగు వృద్ధిచెందుచుండును కనుక దౌర్జన్యమును పూర్తిగా మానము మానినపుడే దాని సత్తువ యుడుగుననియు నేను నాప్రజలకు ప్రదర్శింపదలచితిని.

చెడుగుతో సహకరింపకపోవుటవలన సంభవించు శిక్ష నైచ్ఛికముగ ననుభవించుటయే దౌర్జన్యరహితపద్ధతిలో నున్న భావము. చట్టము ప్రకార మేది నేను బుద్ధిపూర్వకగము గావించిన నేరమో, నాదృష్ట్యా యేది భారతపౌరుని పరమధర్మమో, దాని కెంతహెచ్చు శిక్ష విధింపవచ్చునో యంతశిక్ష విధింపవలసినదనియే నేను కోరుచున్నాను. నేను నిజముగా నిరపరాధినని, మీరు పరిపాలింపవలసిన చట్టములో చెడుగు కలదని మీరు భావింతురేని జడ్జిగానున్న మీరుమీపదవికి రాజీనామా యిచ్చి యీచెడుకార్యముతో సంబంధము లేకుండ చేసికొనవలెను. లేక యేచట్టమును పద్ధతిని మీరు సమర్థించుచున్నారో యది భారతప్రజలకు కళ్యాణమే యని నాకార్యకలాపము ప్రజాశ్రేయస్సుకు భంగకరమని మీరు భావించుచో నా కత్యంత కఠినశిక్ష విధింపవలెనని యే నేను కోరుచున్నాను.

---